Regd No. M.1118.

12 పేజీలు-2 అణాలు


**శ్రీ రాజరాజేశ్వరీ అగరువత్తి ఫ్యాక్టరీ, అనకాపుత్తూరు**

వస్తువులలో శ్రేష్ఠమైనవి శ్రీ రాజరాజేశ్వరి అగరువత్తి ఫ్యాక్టరీలో ఉత్పత్తియగు జ్యోతీ పూజా, జ్యోతి స్పెషల్ జవ్వాజి, జ్యోతీ స్పెషల్ కస్తూరీ, జ్యోతీ స్పెషల్ మడ్డిపాల వత్తులే. అవి మా వద్ద చిల్లరగను, టోకుగను దొరకును.

సోల్ డిస్ట్రిబ్యూటరు:

ఎ. పొన్నుస్వామి పిళ్లై,

167, అన్నా పిళ్లై వీధి, మద్రాసు 1.





Founder: K. NAGESWARA ROW.

SUNDAY EDITION.

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 27th NOVEMBER 1949 No. 234



**తెలుగు మెఱుగులు**

గ్రంథకర్త: వేటూరి ప్రభాకరశాస్త్రి

తెలుగుదనము, తెలుగుసంప్రదాయాలు, తెలుగుభాష అవతరించిన విధము, తెలుగు తేటదనము, తెలుగు కవితా పారమ్యము, ప్రాచీన గ్రంథాల పలుకుబడికి మనపై చెల్లుబడి, విలక్షణమైన మన అరసున్న చరిత్ర, వింత వింత నిఘంటువులు, మనగ్రంథాలలోని గ్రంథులు, అవీ ఇవీ, ఇంకా తెలుగులో ఉన్న ఎన్నో మెఱుగులను చూపెట్టుచున్న వ్యాసముల సంపుటి, శాస్త్రిగారి పాతిక ముప్పయిసంవత్సరాల సాహిత్య కృషి ఇందులో మూర్తీభవించియున్నది. వెల రు. 2/- తపాలా ఖర్చులు 0-7-0.

ఆంధ్రగ్రంథమాల, తపాలాపెట్టె 212, మద్రాసు.


# భారత రిపబ్లిక్ రాజ్యాంగానికి పరిషత్ ఆమోదం

## సత్య అహింసలపై దృఢవిశ్వాసంతో స్వతంత్ర భారత నిర్వహణం:

## రాజేంద్రప్రసాద్ ఉద్బోధ

### సభాపతి సంతకం కాగానే పరిషత్ సభ్యుల జయ జయ ధ్వానాలు

**న్యూఢిల్లీ, నవంబర్ 26: భారత రిపబ్లిక్ నూతన రాజ్యాంగాన్ని రాజ్యాంగ పరిషత్తు నేడు సభ్యులలో అపరిమిత హర్షధ్వానులు చెలరేగగా ఆమోదించింది. నేటి ఉదయం 11 గంటల 10 నిమిషాలకు పరిషత్తు రాజ్యాంగాన్ని ఆమోదించగా, అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు 11-12 లకు దానిపై సంతకంచేసి, అధికారముద్ర వేశారు.**

**ఈ రాజ్యాంగం 32 కోట్ల భారతప్రజాబాహుళ్యానికి వర్తిస్తుంది.**

**సరిగా 11 గంటల 7 నిమిషాలకు "భారత ప్రజాపరిషత్తు స్థిరపరచిన రూపంలో రిపబ్లిక్ రాజ్యాంగాన్ని ఆమోదించాలి," అని డా॥ అంబేద్కర్ ప్రతిపాదించిన తీర్మానాన్ని అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు వోటుకు పెట్టారు.**

**అంతా ఒక్కసారి 'ఔను' అని కేకపెట్టి, తమ ఆమోదాన్ని వెల్లడించారు.**

కాని ఒక్కరు మాత్రం - మౌలానా హజ్రత్ మొహానీగారు 'లేదు' అని కేకపెట్టారు. ఈయన లోగడ చర్చలో సోవియట్ రాజ్యాంగం మోస్తరు రాజ్యాంగాన్ని ఆమోదించవలసినదని విజ్ఞప్తిచేశాడు.

11-12 లకు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు అధికారముద్ర వేయటంతో రాజ్యాంగంలోని కొన్ని భాగాలు తక్షణం అమలులోకి వచ్చినవి.

తక్షణం అమలులోకి వచ్చే అంశాలలో పౌరస్వత్వం, తాత్కాలిక పార్లమెంటు, తాత్కాలిక, మధ్యస్త ఏర్పాట్లకు సంబంధించిన సూత్రాలు ఉన్నవి.

డా॥ రాజేంద్రప్రసాద్‌గారు 50 నిమిషాలసేపు ఉపన్యసించారు.

"మనం సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొని కాపాడుకొనే బాధ్యతా, సాధారణప్రజలకు తోడ్పడే సత్ఫలితాలను ఇచ్చేట్లు చేసేబాధ్యతా మనమీదనే ఉన్నది. స్వతంత్ర రిపబ్లిక్ నిర్వహణకు ఆత్మవిశ్వాసంతోనూ, సత్యాహింసలతోనూ, అన్నిటికన్నా ఎక్కువగా ఆత్మసాక్షిగానూ, భగవత్సాక్షిగనూ పూనుకుందాం."

అని ఆయన హెచ్చరించగా సభ్యులు ఉత్సాహంతో కోలాహలం చేశారు.

(3-వ పేజీ చూడుడు)

## కిసాన్ మజ్దూర్ రాజ్యాన్ని కాంగ్రెస్ స్థాపించలేదు

### జయప్రకాశనారాయణ సందేహం: రైతు సత్యాగ్రహులసభలో ప్రసంగం

పాట్నా, నవంబరు 25: ఇక్కడ నేటి సాయంకాలం కిసాను సత్యాగ్రహుల సభలో మాట్లాడుతూ సోషలిస్టు నాయకుడు జయప్రకాశనారాయణ, కాంగ్రెసువల్ల పని జరగదనీ, అది కిసాను మజ్దూరు రాజ్యం స్థాపించజాలదనీ, ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యాలు లేని నూతన వ్యవస్థ ప్రారంభించే శక్తి కాంగ్రెసుప్రభుత్వానికి లేదనీ, ... విధానాలే చెబుతున్నవనీ అన్నారు. 10 వేలమంది కిసానులు సభకు హాజరైనారు.

ప్రభుత్వ ప్రతికూలపక్షాలు ప్రజాస్వామిక పద్ధతులలో పనిచేయడానికి అవరోధాలు కల్పించే కాంగ్రెసుప్రభుత్వ విధానం చూస్తే ఈ ప్రభుత్వాన్ని శాంతియుతంగా ఎన్నటికైనా పడగొట్టగలమా అనే సందేహం తనవంటి తొణకనివాడికే కలుగుతున్నదనీ, ప్రభుత్వాన్ని పడగొట్టడానికి తాను హింసావిధానాలు అవలంబించవలసిన అవసరం కలిగించే విధానాలను ప్రభుత్వం అవలంబించరాదనీ, దేశంలో అశాంతి అరాజకాలు చెలరేగడం తన కిష్టంలేదనీ, అందుచేత ప్రజలు ఏకమై ... చేయూర్పుకొని రాగల ఎన్నికలలో ఈ ప్రభుత్వాన్ని గద్దెమీదనుంచి దింపాలనీ, హింసాయుత విప్లవానికైనా సరి ఆయన సమీకరణ జరగ్గనిచో గూండా రాజ్యమో, కమ్యూనిస్టురాజ్యమో అవతరిస్తుందనీ జయప్రకాశనారాయణ హెచ్చరించారు.

... సంస్థాన రాజులూ, జమీందారులూ, పెట్టుబడిదారులూ, ప్రభుత్వాధికారులూ అనే నాలుగు దోపిడీ వర్గాలపట్ల కాంగ్రెసుప్రభుత్వం అవలంబించిన విధానాలవల్ల తనకు ఆ ప్రభుత్వంలో విశ్వాసం పోయిందనీ జయప్రకాశనారాయణ చెప్పారు.

ప్రజలరక్తాన్ని పీల్చి అంతులేని సంపద చేజిక్కించుకొన్న సంస్థానాధిపతులకు నిర్భాగ్యుల పొట్టగొట్టి పెద్ద పెద్ద భరణాలు ఇస్తున్నారు. ... వారిని రాజప్రముఖులను చేసి రాష్ట్ర గవర్నర్లకంటె ఎక్కువ అధికారాలిచ్చారు. ... ప్రజలను పీడించడానికి సంస్థానాలవారికి అనుమతి ఇచ్చిన బ్రిటిషువారైనా రాజకీయాలలోకి వారిని రానిచ్చి ఉండలేదు. ఈపని కాంగ్రెసు ప్రభుత్వం చేసింది.

పేరుకు జమీందారీలను రద్దుచేస్తామని కాంగ్రెసు ప్రభుత్వం అన్నదిగాని, పెద్ద పెద్ద జమీందారులు కిసానులను దోపిడీచేసి సంపాదించిన ఆస్తులను ఉంచుకోనిచ్చింది. దుష్టమైన జమీందారీ విధానం ఇంతికాలం అమలుజరిగినందుకు ప్రభుత్వం జమీందార్లకు పరిహారంకూడా ఇవ్వ సంకల్పించింది. కాంగ్రెసువారు అమలు జరిపే జమీందారీల రద్దు కిసానులకు లాభకరం కాదు. జరిగే మార్పల్లా ఏమంటే జమీందారు వసూలుచేస్తూ ఉండిన పన్నులు ప్రభుత్వం వసూలు చేస్తుంది. మానోపటంగ్ ... చేసినట్లుగా కాంగ్రెసు ... వెంటనే భూములను స్వతంత్రంగా ... రైతులకు పంచినట్లయితే అదివారి ... లేదు. కాని అటువంటి పని చేయూలనే ... వారికి లేకపోయింది.

... మీ ... వాకా మీజోలికి రామని ప్రభుత్వం పెట్టుబడిదార్లకు హామీ ఇచ్చింది. తాము పదవిలోకివచ్చి స్వాతంత్ర్యం లభించగానే ముఖ్య పరిశ్రమ లన్నిటినీ జాతీయం చేస్తామని కాంగ్రెసు వారు 1931 లో కరాచీ కాంగ్రెసు నాటినుండీ ఆడపాడపా చెబుతూవచ్చినమాట ప్రజలు మరిచిపోయినారు. ఈసమస్యనుగురించి పండిట్ జవహర్లాలు నెహ్రూ వెనుక వ్రాసిన విషయాలు చదివినవారికి చాలా ఆశాభంగమయింది. ఇప్పటికైనా, పరిశ్రమలు జాతీయం చేయకపోతే రాజీనామా ఇస్తానని పండిట్ నెహ్రూ బెదరించినట్లయితే ఆయనపంతం నెగ్గుతుంది. అదే పదేళ్ళ అనంతరం పెట్టుబడిదార్లు ఇంకా బలపడి, కాంగ్రెసులో మరింత పలుకుబడి సంపాదించి పండిట్ నెహ్రూకే ఉద్వాసన చెప్పగలుగుతారు. ప్రభుత్వం వారు పెట్టుబడిదార్లను దువ్వుతూ, వారి గ్రామికాభివృద్ధి సాధించమని ప్రార్థేయపడుతూ, ఆదాయపుపన్ను సుంకాలు తగ్గించే విధానం అవలంబించినంతకాలము గ్రామికులస్థితి చక్కబడదు.

తాము పదవిలోకి వస్తే ఉన్న ఉద్యోగుల జీతాలు నెలకు 500/- రూ మించకుండా తగ్గిస్తామని చెప్పిన కాంగ్రెసువారు, పదవిలోకి తీరా రాగానే తక్కువ ఉద్యోగుల జీతాలు అలాగే ఉంచి ఉన్నతోద్యోగుల జీతాలు పెంచుచున్నారు. గవర్నర్ జనరలు జీతం నెలకు 10 వేల రు. తక్కువ తరగతి కనీసవేతనం నెలకు 30/- 2 వేల రూ జీతగాళ్ళ జీతాలు 3 వేలకు పెంచబడినవి.

ఈవిధంగా దోపిడి వర్గాల క్షేమంకొరకు తమ విధానాలను ఏర్పరచిన కాంగ్రెసు ప్రభుత్వం కిసాను మజ్దూరు రాజ్యం ఏర్పాటు చేస్తుందని ప్రజలు ఏవిధంగా ఆశించగలుగుతారు?

ఎన్నికలద్వారా కాంగ్రెసు ప్రభుత్వాన్ని తొలగించవచ్చునన్న విషయం ప్రజలు జ్ఞాపకం ఉంచుకోవాలి. అందుకుగాను కృషిచేయాలి. ప్రజలు సంఘటితులుకానట్లయితే ఎప్పటికీ కాంగ్రెసు పరిపాలన తప్పదు. ప్రజలు ప్రతిదానికీ ప్రభుత్వంమీద ఆధారపడక తను కాళ్ళపై తాము నిలబడడానికి ప్రయత్నించాలి. వారు తమ ఉమ్మడి సమస్యలను పరిష్కరించుకొనడానికి గ్రామ పంచాయతులు ఏర్పాటుచేసుకోవాలి. స్వలాభం కొరకు నిర్మాణ కార్యక్రమం సాగించాలని జయప్రకాశనారాయణ అన్నారు.

## గాంధీజీ సూత్రాల సాఫల్యం

### పరిషత్తులో డా॥ పట్టాభి ప్రశంస

న్యూఢిల్లీ, నవంబర్ 25: నూతన భారత రాజ్యాంగంలో గాంధీజీ సిద్ధాంతాలలో ప్రధానమైనవన్నీ ఇమిడి ఉన్నవని రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేడు రాజ్యాంగ పరిషత్తులో ఉద్ఘాటించారు. దానికి ఉదాహరణగా ప్రత్యేక నియోజక వర్గాల తొలగింపు, అస్పృశ్యతా నిర్మూలనము వయోజనులందరికీ వోటింగ్ హక్కు నివ్వటం మొదలైన అంశాలను ఆయన ఉదహరించాడు.

రాజ్యాంగరచనాసంఘ సభ్యుడు టి. టి. కృష్ణమాచారిగారు ప్రసంగిస్తూ 8 రోజులనుండీ జరిగిన చర్చకు రచనాసంఘం తరఫున జవాబిచ్చారు. ఫ్రాంక్ ఆంథోనీ, జగత్ నారాయణలాల్, మహావీర్ త్యాగి మొదలైనవారు కొన్నికొన్ని అంశాలతో రాజ్యాంగాన్ని విమర్శించినా మొత్తంమీద ప్రశంసిస్తూ ప్రసంగించారు. పోలీసు, విద్య, ఆరోగ్యశాఖలకు

(3-వ పేజీ చూడుడు)

## కమ్యూనిస్టు శాంతి కాంగ్రెస్ సమావేశ విపరీత ధోరణి

### కేంద్రప్రభుత్వాన్ని కూలద్రోయాలని పలువురు సభ్యుల విద్రోహ ప్రలాపాలు

కలకత్తా, నవంబరు 25: కమ్యూనిస్టు ప్రాబల్యంక్రింద నడుస్తున్న అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అధ్వర్యాన ఇక్కడ జరుగుతున్న అ. భా. "శాంతి కాంగ్రెస్" సభలో నేడు పలువురు సభ్యులు ప్రసంగిస్తూ, బలాత్కార పద్ధతుల ననుసరించి, భారతప్రభుత్వాన్ని కూలద్రోయాలని, నిర్భయంగా బహిరంగంగా ప్రకటించారు. అంతటితో ఆగక సోవియట్ నాయకులయెడ తమభక్తి విశ్వాసాలను ప్రకటిస్తూ, సోవియట్ రష్యాను బలపరుస్తామని ప్రమాణ స్వీకారం చేశారు. ఇటీవలే జైలునుంచి జామీనుమీద విడుదలైన ఒక అనామక ఖైదీ జైలులో తాను పడ్డ బాధలను ఏకరువుపెట్టాడు. తలమాసిన ఒలుమాసిన యూ ఖైదీ, తన కష్టాలను వర్ణించే సమయంలో ఆవేశ వివశుడుకాగా ఆవేశంతో నుండి అగి హఠాన్మరణమునకు ఎక్కడ సరిపోతాడో అని సభ్యులు ఆయనకు సహాయపడవలసిన స్థితి వచ్చింది.

రష్యాకు అనుకూలంగా, ప్రభుత్వానికి ప్రతికూలంగా నినాదాలు మారుమ్రోగుటకు యిది సాంద్రప్రాయమైంది. "... బద్దలు కొట్టాలి" అనే నినాదాలు, ఆంగ్లో-అమెరికన్ వ్యతిరేక నినాదాలు, ప్రభుత్వ ప్రతికూల నినాదాలతో సభాస్థలి మారుమ్రోగినది. నేటిసభకు వచ్చినవారిలో ఆడపిల్ల, చంటిబిడ్డల నెత్తుకొనివచ్చిన గృహిణులు ఎక్కువగా ఉన్నారు. చిట్టగాంగ్ ప్రతినిధి మహిళ ..., పాకిస్తాన్ ప్రభుత్వముగూడా దమననీతిని అనుసరిస్తు, ప్రజా ఉద్యమాన్ని అణచివేస్తున్నదని, రష్యాతో యుద్ధానికి ఆంగ్లో అమెరికన్ కూటమితో పాకిస్తాన్‌కు పొత్తు కలిపింది అన్నాడు. భారతదేశంలో శాంతికాముకులతో చేయి కలిపి పనిచేస్తానని వాగ్దానం చేశాడు. మహారాష్ట్రకు ... కమిటీ సభ్యుడు రాజగోపాలాచారి మాట్లాడుతూ, 1943 బెంగాలు క్షామానికి కారకులైన దొంగమార్కెట్ వర్తకులను ఉరితీయాలని నెహ్రూ అన్నారు కాని అధికారంలోకి వచ్చిన తరువాత ఆయన యేం చేశారు" అన్నారు.

కమ్యూనిజం వ్యాప్తికి అనువైన ప్రదేశాలనే భయంతో, కాందిశీక శిబిరాలను పడమటి బెంగాల్ ప్రభుత్వం ఎత్తివేస్తున్నదని బెంగాల్ ప్రతినిధి అన్నాడు.

నేటి సమావేశంలో, 75 మంది ప్రతినిధులతో శాశ్వత శాంతి సంఘం ఒకటి యేర్పాటు చేయబడింది.

తెలంగాణాలో, 30 మంది రైతులకు హైదరాబాద్ ప్రభుత్వం ఉరిశిక్ష విధించినందులకు, ఈ సమావేశానికి వస్తున్న ప్రపంచ దేశాల ప్రతినిధులను రష్యాలో నిర్బంధించినందులకు ఆందోళన తెలుపుతూ, రెండు తీర్మానాలు ఆమోదింపబడినది.

రేపు మైదానంలో ఊరేగింపు ఏర్పాటు చేయబడింది. ఊరేగింపు అయిన తరువాత నగర వీథులలో గూడ ఊరేగింపులు జరుగుతవి.

## మైసూరులో భారత రాజ్యాంగం అమలు

బెంగుళూరు, నవంబరు 25: ఈ వేళ మైసూరు మహారాజా ఒక ప్రకటన చేస్తూ దానిలో త్వరలో ఆమోదింపబోయే భారత రాజ్యాంగం మైసూరు సంస్థానానికి కూడా వర్తించాలని ఆదేశించారు.

మహారాజా చేసిన ఈ ప్రకటనవల్ల భారత రాజ్యాంగంతో వ్యతిరేకించే మైసూరు సంస్థానచట్టాలన్నీ రద్దయిపోతాయి.

మరిన్ని ఈ ప్రకటనవల్ల డిసెంబరు 16 తో ఇప్పుడున్న శాసనసభలు రెండు రద్దయిపోతాయి. కొత్తశాసనసభలు అమలులోకివచ్చేదాకా ఇప్పుడున్న మైసూరురాజ్యాంగపరిషత్తే శాసనసభ గామారిపోతుంది.

## "ప్రాజెక్టులనిర్మాణంలో తరతమ భేదాలు పాటించాలి"

### రూర్కీ ఇంజనీరింగ్ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో నెహ్రూ వివరణ

రూర్కీ, నవంబరు 25: భారతప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ నేడిక్కడ థామ్సన్ ఇంజనీరింగు విశ్వవిద్యాలయ ప్రథమ స్నాతకోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ, దేశంలో ప్లానింగు సవ్యమైన పద్ధతులమీద జరగాలనీ, ఏ ప్రాజెక్టులు ముందుచేపట్టాలి ఏవి తర్వాత పూనుకోవాలి అన్నది వాటివాటి ప్రాధాన్యముల తరతమ భేదములనుబట్టి నిర్ణయించాలనీ, ఉద్ఘాటించిరి.

గడచిన శతాబ్దంగానడుస్తున్న ఈ థామ్సన్ ఇంజనీరింగు కాలేజి ఈ వేళ ఇంజనీరింగు విశ్వవిద్యాలయంగా మార్పు చేయబడినది.

యు. పి. గవర్నర్ సర్ హెచ్. పి. మోడీ, ప్రధాని పండిట్ గోవిందవల్లభ్ పంత్ మొదలైనప్రముఖులు సమావేశానికి హాజరైరి. వివిధప్రాంతములనుండి వచ్చిన ఇంజనీర్లు ప్రేక్షకులుఅంతాచేరి 10 వేల మందికిపైగా ఈ సమావేశంలో పాల్గొనిరి. విశ్వవిద్యాలయంగా పనిచేయడానికి అనుమతిస్తూ ఈ సంస్థకు ప్రభుత్వం ఇచ్చిన అనుజ్ఞాపత్రాన్ని సర్ హెచ్. పి. మోడీగారు ఒకరజతపేటికలోపెట్టి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడైన ఏ. సి. హార్టుకు సమర్పించిరి.

పండిట్ నెహ్రూ ఉపన్యాస సారాంశం ఇది:- మనదేశంలో ఇప్పుడు ఎక్కడ చూచినా, స్కీములు ప్రాజెక్టులగురించిన ప్రసంగాలే పొద్దస్తమానం వినిపిస్తున్నవి. ప్రతివారు భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిపరచాలని విసవిరామం లేకుండా నోరునొచ్చేట్లు ఉపన్యాసములు ఇస్తున్నారు. కాని ఒక్కరూ ఈ విషయాన్ని సర్వతోముఖంగా పరిశీలించి సంతతంగా ఒకవిధానాన్ని ఏర్పరచవలసిన ఆవశ్యకతను గమనించినట్లు కన్పించదు. నేడు దేశంలో రాష్ట్రాలకూ కేంద్రానికే కాకుండా ప్రభుత్వంలోని ఏ రెండు శాఖల మధ్య సమన్వయం కన్పించడం లేదు. కొన్నిరాష్ట్రాలు ఇంచుమించు స్వతంత్ర దేశాలైనట్లుగా వ్యవహరిస్తున్నవి. భారత దేశంలోని వివిధ ప్రాంతాల పథకాలను సమన్వయపరచి దేశాన్ని సమిష్టిగా ఏకఖండంగా అభివృద్ధిపరచాలన్న దృష్టి లుప్తమైపోతున్నది. ఈ విధమైన సమగ్రదృష్టి లోపించి పోవడంవల్ల మన అంగబలము అర్థబలము వ్యర్థమైపోతున్నవి. నేషనల్ ప్లానింగు కమీషన్‌వారు తయారుచేసిన అభివృద్ధి పథకములలో అనేకమైన వాటిని ప్రస్తుతం చాలించుకోవలసి వచ్చి

(2 వ పేజీ చూడుడు)


**అప్రెంటిసులు కావలెను**

బెజవాడ మునిసిపల్ సరిహద్దులలో యున్న పటమట గ్రామమున గల మా ఫ్యాక్టరిలో యిత్తడిని కరిగించి పోతపోయుట ఫైలింగు, పాలిషింగు, యెలెక్ట్రొ ప్లేటింగు మొదలుగాగల వివిధశాఖలలో తర్ఫీదు పొందుటకు ఉత్సాహముకల యువకులు ఉపకారవేతనముపై అప్రెంటిసులుగా తీసికొనబడుదురు. అనుభవము కల్గిన యింజనీయర్లు, యిన్‌స్ట్రక్టర్లచే క్రమశిక్షణ యొసగబడును. పిమ్మట యోగ్యతలను బట్టి వీరికి ఖాయముగా ఫ్యాక్టరిలో ఉద్యోగము లొసగబడును. కొలది ఖాళీలుమాత్రమే కలవు. వెంటనే ఈ క్రిందివారికి దరఖాస్తులు పంపవలెను.

**హాండిల్సు అమ్మకమునకు**

ఆకర్షణీయముగా నికెల్ ప్లేటింగు చేయబడిన యిత్తడిపోత గడియలు, హాండిల్సు బందులు మొదలుగాగల గృహనిర్మాణ వస్తువులు మంచి పనితనముతో పలురకములను నమూనాలలోను, సైజులలోను అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. యినుప పెట్టెలు, పర్నిచరుచేయు పారిశ్రామికులకు, వారు కోరిన నమూనాలలో పై వస్తువులను తయారుచేసి యివ్వగలము. వివిధరకములగు యిత్తడిపోత గ్లాసులు, గరిటెలు కూడ అమ్మకమునకు సిద్ధముగా నున్నవి. వివరములకు:

కాజ వెంకట సూర్యప్రకాశరావు, బి. ఏ.,

మేనేజింగు డైరెక్టరు,

**ది బెజవాడ మెటల్ అండ్ స్టీల్ యిండస్ట్రీస్ లిమిటెడ్.,**

సూర్యారావుపేట, బకింగుహాంపేట పోస్టు, బెజవాడ.



**ప్రకటన**

విజయ పబ్లికేషన్సు లిమిటెడ్‌వారు తమ తెలుగు దిన పత్రిక త్వరలోనే వెలువడునని తెలుప సంతసించుచున్నారు.

ఈ తెలుగు దిన పత్రికకు తగిన పేరు సూచింపవలసినదిగ ప్రజలను కోరుచున్నాము. అంగీకరింపబడిన పేరుకు రు 116/-లు బహుమతి యివ్వబడును. మీ సూచనలు దయచేసి క్రింది చిరునామాకు పంపండి:

**విజయ పబ్లికేషన్సు లిమిటెడ్,**

"శుభోదయ" 38, మౌంటురోడ్డు, మదరాసు-6.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు॥ అష్టమి

1949 సం॥ నవం॥ 27 ఆదివారం

అ॥ అష్టమి తె 4-27 శత 24-0 వర్జ్యం ప 1-36 ల 3-20 వ.

శు॥ నవమి నవం॥ 28 సోమవారం

సో॥ నవమి రా 24.0 శత ఉ 7-56 వర్జ్యం ప 3-4 ల 4-51 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు॥ అష్టమి

ఆదివారం

## నవ శకారంభము

"భారత దేశమును సర్వాధికార సమన్వితమైన స్వతంత్ర ప్రజాస్వామ్య రాజ్యముగ ప్రకటించుటకును, భారతదేశ భవిష్యత్పరిపాలనకొరకు రాజ్యాంగమును తయారుచేయుటకును పరిషత్తు కృతనిశ్చయమై యున్నదని ఇందుమూలముగ ప్రకటించుచున్నాము...... ఈ చట్టము ప్రకారము సర్వాధికార సమన్వితమైన స్వతంత్ర భారత రాజ్యము యొక్కయు, అందలి అంతర్భాగముల అధికారము యావత్తు ప్రజలహస్తగతమైయుండును. భారతీయ ప్రజలు అందరికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములలో సంపూర్ణమైన న్యాయము జరిగించ గలమని హామీ నివ్వవలయును. ప్రతి వ్యక్తికి సమానహోదా, సమానావకాశములు కల్పింపబడవలయును. న్యాయశాస్త్ర దృష్ట్యా, భారతీయులు అందరు సమానులుగ పరిగణించబడవలెను. ప్రతి వ్యక్తికి న్యాయనైతిక నియమముల సరిహద్దులలో భావనా స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, మత, దేవతారాధన వృత్తి స్వాతంత్ర్యములు, సమ్మేళనా స్వాతంత్ర్యము, కార్యస్వాతంత్ర్యము ఒసంగబడగలవని అభయమివ్వవలెను."

రెండు సంవత్సరముల క్రితము రాజ్యాంగరచనకు ఉపక్రమించుటకు పూర్వము స్వతంత్ర భారత రాజ్యాంగము సాధింపవలసియున్న ప్రధాన లక్ష్యములను చరిత్రాత్మకమైన లక్ష్యతీర్మానమునందు పైవిధముగ భారత రాజ్యాంగపరిషత్తు పేర్కొనియుండెను. పరిషత్తు లక్ష్యతీర్మానమును ఆమోదించినప్పటి పరిస్థితులకును, రాజ్యాంగరచనా కార్యక్రమమును ప్రారంభించినప్పటి పరిస్థితులకును విశేషభేదము ఉండుటవలన నిన్నటిదినము భారత రాజ్యాంగపరిషత్తు సమక్షమునందు ఆమోదించిన భారత రిపబ్లిక్ రాజ్యాంగము అనేక విషయములందు లక్ష్యతీర్మానము నందలి సూత్ర, సిద్ధాంతములకు భిన్నముగ నుండుట జరిగినది.

తమ రాజ్యాంగచట్టము సాయిధాను సమర్థించుకొనుచు రచనాసంఘసభ్యులు పలువురు ప్రకటించినట్లు, ఏ రాజ్యాంగము అన్నికాలములకు తగినట్లు, అవశ్యప్రాయముగ నుండజాలదు. రాజ్యాంగము పరిపూర్ణప్రాయముగ, లోపరహితముగ నున్నను అట్టి రాజ్యాంగమును అమలు జరుపువారు దేశాభ్యుదయమును, ప్రజాక్షేమమును, జాతిక్షేమమును ప్రధానముగ పరిగణించి వ్యవహరింపకున్న, అట్టి రాజ్యాంగము నిరుపయోగము, నిష్ప్రయోజనము అగును. తృతీయ ప్రతిపాదనపై జరిగిన చర్చకు సమాధానమొసగుచు రచనాసంఘ అధ్యక్షుడు డా॥ అంబేడ్కర్ ఈ సత్యమునే అనేక పర్యాయములు హెచ్చరించిరి.

1950 జనవరి 26 న నూత్న రాజ్యాంగము అమలుజరుగుటతో భారతదేశమున నవ శకారంభమగును. రాజకీయముగ భారత సమితి పౌరులందరును సమానులగుదురు. రాజకీయమైన తరతమభేదములు అంతరించి రాజకీయ ప్రజాస్వామ్య మేర్పడును. కాని రాజ్యాంగ పరిషత్తు లక్ష్యించినది, స్వతంత్రభారతమున కాంగ్రెసు స్థాపింప సంకల్పించినది సంపూర్ణమైన ఆర్థిక, సాంఘిక, రాజకీయ ప్రజాస్వామికము - కోఆపరేటివ్ కామన్వెల్తు. ఆ మహదాశయసిద్ధికి ఈ రాజ్యాంగము సాధనమాత్రమే. ఈ సాధనను సద్వినియోగము చేసుకొని ఆ పవిత్రాశయమును సాధింపవలసిన బాధ్యత భారతీయులు అందరిపైనను గలదు. రాజ్యాంగ రచనాసంఘ అధ్యక్షుడు డా॥ అంబేడ్కర్ హెచ్చరించినట్లు భారతీయ పౌరుడు ప్రతి ఒక్కడు స్వార్థమును, తనవర్గ అపేక్షలను త్యజించి దేశాభ్యుదయమునే ప్రధానముగ యెంచి కృషి చేసిన గాని దేశస్వాతంత్ర్యము, రాజకీయ ప్రజాస్వామ్యము స్థిరముగ నుండజాలదు. కాని ముందు సాధింపవలసిన సామాజిక ప్రజాస్వామ్యమును ఏర్పరచుటలో డా॥ అంబేడ్కర్ ప్రజలు చట్టబద్ధమైన మార్గములనే అనుసరించవలసియున్నదనుచు సాత్వికనిరోధము, సత్యాగ్రహముల గురించి చేసిన విమర్శ అప్రస్తుతమె గాక వారికి పరిషత్తు చేసిన గౌరవమునకు తగియుండలేదు.

నవంబరు 26 స్వతంత్ర భారత చరిత్రయందొక ప్రసిద్ధ దినముగ పరిగణింపబడగలదు. రాజ్యాంగ పరిషత్తు 35 మాసములు చర్చించి తయారుచేసిన రాజ్యాంగము ఆమోదింపబడి శాసనమైనది. భారతదేశమున తిరిగి ప్రజాస్వామిక యుగము ప్రారంభమైనది. ప్రజల బాధ్యతలు అధికమైనవి. ఈ బాధ్యతను ప్రజలు సక్రమముగ నిర్వహించిన స్వతంత్ర భారత రిపబ్లిక్ సుస్థిరమై ప్రపంచ రాజ్యములందు ప్రముఖ స్థానమును పొందగలదు.

---

## ముక్డెన్‌లో అమెరికన్ కాన్సల్ అరెస్టు

### రష్యా జోక్యం ఉన్నదని బ్రిటిష్ అధికారి ప్రకటన

హాంకాంగ్, నవంబరు 25: అక్టోబరు 24 వ తేదీన, ముక్డెన్‌లోని అమెరికన్ కాన్సల్ జనరల్ ఆంగస్ అవార్డును, చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం అరెస్టు చేయడంలో రష్యా జోక్యం ఉన్నదట. ఈ విషయం చైనా పత్రాలవారు బయట పెట్టినట్లు, హాంకాంగ్‌లోని ఒక బ్రిటిష్ ఉద్యోగి అన్నాడు. ఈ పత్రాల సమాచారము నమ్మదగిన దేననికూడా యీయన తెలియజేశాడు.

కాన్సలర్ కార్యాలయానికి చెందిన నల్గురు ఉద్యోగులతోసహా, వార్డు అరెస్టయినాడు. చైనా ఉద్యోగిని కొట్టినట్లు యీయనపై నేరారోపణ. చైనాలో తమ ప్రతినిధులను ఉంచి, బ్రిటన్, రష్యా, తదితర దేశాలు, యీ విషయంలో జోక్యం కల్పించుకొని అంగస్ అవార్డును విడిపించాలని విజ్ఞప్తి చేశారు. ఏమైనప్పటికి చైనా కమ్యూనిస్టు ప్రజా న్యాయస్థానంవారు, ఆ యన సహచర ఉద్యోగులు, చైనానుంచి వెడలిపోవ బహిష్కార ఉత్తర్వు చేశారు.

---

# "సాంఘిక ప్రజాస్వామ్యాన్ని సాధిస్తేనే రాజకీయ ప్రజాస్వామ్యం స్థిరపడగలదు"

## భారతపౌరులు దేశాన్ని ప్రధానంగా ఎంచి ప్రజాభ్యుదయానికి కృషిచేయాలని అంబేద్కర్ ఉద్బోధ

న్యూఢిల్లీ; నవంబరు 25: "మన ఒంట్లో చివరినెత్తురు బొట్టు దాకా మనం సాధించిన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవాలి," అని నేడు రాజ్యాంగపరిషత్తులో జరిగిన చర్చలకు సమాధాన మిస్తూ రాజ్యాంగరచనా సంఘాధ్యక్షులు డా॥ అంబేద్కరు సభ్యులను హెచ్చరించారు.

"1950 జనవరి 26 నుంచి భారతదేశం స్వతంత్రతను పొందబోతున్నది. ఆ రోజునుంచీ దేశంలో ప్రజలచేత, ప్రజలకొరకు, ప్రజలయొక్క ప్రభుత్వం పరిపాలన సాగిస్తుంది. ఆరోజు సర్వశః సమగ్రమైన స్వతంత్ర ప్రతిపత్తిని దేశం పొందుతుంది," అని కూడా డా॥ అంబేద్కర్ తన ఉపన్యాసంలో స్పష్టంచేశారు.

"ఈ స్వాతంత్ర్యం చిరస్థాయిగా వుండిపోవాలంటే మన దేశంలోని రాజకీయ పక్షాలు ముందుదేశం; తరువాత సిద్ధాంతాలు అన్న భావాభినివేశాన్ని అలవరచుకోవాలి. అట్లా చేయనిపక్షంలో దేశం తన స్వాతంత్ర్యాన్ని కోల్పోతుంది," అని ఆయన హెచ్చరించారు.

డా॥ అంబేద్కర్ ఉపన్యాసాన్ని సభ్యులు హర్షధ్వానాలతో ఆమోదించారు. ఉపన్యాస సందర్భంలో పై మాటలు చెప్పినప్పుడు సభ్యులుచేసిన హర్షధ్వానాలతో పరిషత్తు మందిరం మారోగిపోయింది.

డా॥ అంబేద్కర్ ఉపన్యాసం 45 నిమిషాలసేపు పట్టింది. ఈ ఉపన్యాసంతో 8 రోజులుగా జరుగుతున్న చర్చకు భరత వాక్యం పలికినట్లయింది.

ఇక రేపు రాజ్యాంగపరిషత్తు రాజ్యాంగాన్ని ఆమోదిస్తుంది. అధ్యక్షుని ఆమోద ముద్రను పొందుతుంది.

భారతదేశం సంపాదించుకొన్న ప్రజాస్వామ్యాన్ని అరమరికతో ప్రజలు యదాయదలు చేయరాదని హెచ్చరిస్తూ, అవిరళగంగా ప్రవాహంలాగా డా॥ అంబేద్కర్ నోటివెంట వెలువడిన ఉపన్యాసాన్ని సభ్యులు సావధానులై విన్నారు. భారతీయులు స్వాతంత్ర్య సంరక్షణంలోను, ప్రజాస్వామ్య ధర్మనిర్వహణంలోను ప్రజాతంత్ర విహితమైన పద్ధతులను ఏమరరాదు. ఆర్థిక సామాజిక స్వాతంత్ర్యాన్ని సంపాదించవలసిన అవసరంలో భారతీయుల విప్లవాలను దిగకుండా నడుస్తారని ఆశిస్తున్నాను. రక్తరంజితమైన విప్లవం ఎంత హేయమో సహాయ నిరాకరణ సత్యాగ్రహాది సాత్విక నిరోధమార్గాలుగూడా అంతే హేయాలు అని డా॥ అంబేద్కర్ అన్నారు.

దక్కిన ప్రజాస్వామ్యం దుసికిలిపోయే ఉపద్రవం నాయకులపట్ల చూపే హద్దు మించిన భక్తిలోగూడా వున్నదని ఆయన అన్నారు. భక్తి అనండి, వీర పూజ అనండి, అవి తప్పకుండా నియంతృత్వానికి దారి తీస్తాయి.

ఇప్పుడు మనకు లభ్యమైంది రాజకీయమైన స్వాతంత్ర్యమే అంటూ, దాన్ని ఆర్థిక, సామాజిక ప్రజాస్వామ్యంగా తర్జుమా చేయవలసిన అవసరంగూడా వున్నదని ఆయన పరిషత్తుకు నివేదించారు. ఆర్థికంగాను, సామాజికంగాను, ఏర్పడివున్న అసమానత్వాన్ని అధిగమించి, సమానత్వాన్ని చేపట్టిననాడే, మనం ఒకజాతిగా ప్రపంచంలో వెలుగొందగలమని డా॥ అంబేద్కర్ అన్నారు.

45 నిమిషాలసేపు ఈ విధంగా ప్రసంగించిన అనంతరం సభ్యుల అవిరళ హర్షధ్వానాలలో ఆయన ఉపన్యాసం పూర్తి అయింది. ఆ హర్షధ్వానాలు 3 నిమిషాలపాటు కొనసాగాయి. అనంతరం సభ్యులలో అన్ని వర్గాలవారు ఆయన్ను అభినందిస్తూ కరచాలనా మర్యాదలతో గౌరవించారు.

8 రోజులుగా రాజ్యాంగ తృతీయపఠనలలో సభ్యులుచేసిన విమర్శలకు సమాధానంగా డా॥ అంబేద్కర్ ఇలా అన్నారు.

1950 జనవరి 26 మనకు సంపూర్ణమైన రాజకీయ స్వాతంత్ర్యం లభ్యమవుతుంది. గాని ఆర్థికంగా సామాజికంగా వున్న అసమానత్వం అట్లాగే వుంటుంది. ఈ అసమానత్వాన్ని మనం ఇక తొలగించవలసివుంటుంది. అది ఎంత త్వరలో జరిగితే అంతమంచిది. లేకపోతే లేనివాళ్ళు, ఈ అసమానత్వంవల్ల బాధపడుతున్న వాళ్ళు కలసి రాజకీయ ప్రజాస్వామ్యాన్నిగూడా నాశనం చేస్తారు. ఈ పరిషత్తు దాన్ని ఎంతో కష్టంతో నిర్మించింది. అదీకాకుండా భారతదేశంలో ప్రజాస్వామ్యం నియంతృత్వంలో పర్యవసించే ఉపద్రవంగూడా వున్నది. అందువల్ల మనం ఆర్థికసామాజిక లక్ష్యాలను సాధించడంలో ప్రజాస్వామ్య ధర్మవిహితమైన మార్గాలనే అనుసరించాలి. అంటే మనం రక్తవిప్లవాలను పూర్తిగా పరిహరించాలనినా ఆశయం. మనం సహాయ నిరాకరణోద్యమాలను, సత్యాగ్రహాలను కడంగారాదనినా అభిప్రాయం. ఈమార్గాలన్నీ అరాచకానికి సహోదరాలు. వాటికి ఎంత త్వరలో నీళ్ళువదిలితే అంతమంచిది.

ఇంకో ఉపద్రవం ఏమిటంటే, నాయలంటే హద్దులు దాటిన భక్తి, దాన్ని వీరభక్తి అనాలేమో. దీనివల్ల నియంతృత్వ దోషం దేశానికి త్వరలో పడుతుంది.

ఒకప్పుడు రాజకీయ వేత్తలు భారత ప్రజలు అనడానికి బదులు భారతజాతి అని ఐచ్ఛికంగా అంటూవుండేవాళ్లు. ఇప్పుడు మనం ఒకజాతిఅనే పదానికి సార్థకనామం అని భావించేవాళ్లు ఎవరన్నా వుంటేవాళ్లు పగటిపూట కలలుగంటున్నవాళ్ళని అనాలి. ఇన్ని మతాలు, ఇన్ని కులాలు, వున్న దేశం జాతిపదవాచ్యం ఎట్లా అవుతుంది. ఈమతాలు, ఈకులాలు జాతివిఘాతహేతువులు మనం ఒకజాతిగా వర్ధిల్లాలంటే మనంవీటిన్నింటిని సమయ జెయ్యాలి.

మనంగనుక ఈ లోపాలను సవరించుకోకపోతే దేశంతప్పుదారుల్లో పడిపోతుంది. కాలం రెక్కలమీద పరుగెత్తుతోంది. కొత్త కొత్తమతాలు, సిద్ధాంతాలుమేఘాల్లాగా క్రమ్ముకువస్తున్నాయి.

కమ్యూనిస్టులు,సోషలిస్టులు ఈరాజ్యాంగాన్ని తీవ్రంగా విమర్శిస్తున్నారు. కమ్యూనిస్టుదేశంలో కార్మికనియంతృత్వం వెలయాలి అంటారు. మనందీన్ని పార్లమెంటరీ ప్రజాస్వామ్యంమీద నిర్మించాముగాబట్టి వారు దీన్ని కాదంటున్నారు.

సోషలిస్టులు స్వంత ఆస్తులను జాతిపరం చెయ్యాలని అట్లా చేయటంలో పరిహారం ఇవ్వడం అనవసరమని అంటున్నారు. తాము అధికారంలోకి వస్తే అట్లా చేస్తామంటున్నారు. అధికారంలోకి రావడం చేతకాకపోతే ప్రభుత్వాన్ని విమర్శించే హక్కు నేగాక, రాజ్యాన్నే కూలద్రోసే హక్కుగూడా వుండాలని కోరుతున్నారు.

కాని నేను చెప్పేదేమిటంటే, ఈ రాజ్యాంగంలో ప్రజల భావాభినివేశం బాగా హత్తుకు వుంది. ఇది సరికాదంటారా, రాజ్యాంగం మంచిదైనా, చెడ్డదైనా, అదిఅంతా దాన్ని అమలుపెట్టే వారిలో వుందని పరిషత్తు సభ్యులంతా చెప్పే వున్నారు.

పార్లమెంటులో ⅔ వంతు మెజారిటీతో రాజ్యాంగాన్ని సవరించగల సావకాశం దాంట్లో వుంది. ఇప్పుడు రాజ్యాంగంతో ఏకీభవించని వారికి పార్లమెంటులో ⅔ వంతు మెజారిటీ గూడా రాకపోతే, ప్రజలు వారితో ఏకీభవించడం లేదని అర్థంగా తేలుతుంది.

కొంతమంది ఈ రాజ్యాంగంలో అధికారం అంతా కేంద్రాధీనం చేయబడిందని అంటున్నారు. అది వట్టిఅతిశయోక్తి. అంతేగాదు. ఎట్టి అర్థంకానితనం.

ఇంత మహాకార్యాన్ని ఇంత అల్పకాలంలో సాధించగల్గినందుకు, ఈ పరిషత్తు అందరి మన్ననలకు గురికావాలి. ఈ పరిషత్తు 1946 డిశెంబరులో 9 వ తేదీనాడు ప్రథమంగా సమావేశమైంది. అంటే ఇప్పటికి సరిగా 2 సంవత్సరాల 11 నెలల 17 రోజులు అయింది. ఈ వ్యవధిలో పరిషత్తు 11 సార్లు సమావేశమైంది. మొత్తం 165 రోజులపాటు కూర్చున్నది. ఇందులో 114 రోజులుమాత్రమే రాజ్యాంగపరిశీలనకు వచ్చాయి.

1947 ఆగస్టు 29 వ తేదీనాడు గాని రచనాసంఘం ఎన్నుకోబడలేదు. అప్పటికి ఈ పరిషత్తు రాజ్యాంగసలహాదారుడు తయారుచేసిన రాజ్యాంగం సిద్ధమై వచ్చినది. అందులో 243 అంశాలు, 13 షెడ్యూల్సు వున్నాయి. రచనాసంఘం దానిని 315 అంశాలుగాను, 8 షెడ్యూల్సుగాను మార్చి ముద్రిం ముగాయినా రాజ్యాంగంగా ఏర్పాటుచేసి పరిషత్తుకు సమర్పించింది. దానిమీద చర్చ పూర్తి అయ్యేటప్పటికి ఈ అంశాలు 386 దాకా పోయాయి. ఆఖరిదానికి ఒక సమగ్రరూపం వచ్చేసరికి 395 అంశాలు ఏర్పడ్డాయి. 8 షెడ్యూళ్లు అట్లాగేవున్నాయి.

ఈ రాజ్యాంగానికి మొత్తం 7635 సవరణలు వచ్చాయి. కాని ఇందులో 2473 మాత్రమే ప్రతిపాదించబడినాయి.

ఇదంతా యెందుకు చెబుతున్నానంటే, చర్చలలో ఒక సందర్భంలో కొంతమంది పరిషత్తు ఏదో ఆషామాషీగా పని చేస్తున్నదని, ప్రజల డబ్బునంతా తగలచేస్తున్నదని విమర్శించారు. అందుచేత ఇతర దేశాల విషయంగూడా కొంచెం వివరిస్తాను. అమెరికా తన రాజ్యాంగాన్ని నాల్గు నెలలలో పూర్తిచేసింది. కెనడా రాజ్యాంగం తయారయ్యే సరికి 2 సంవత్సరాల 5 నెలలు పట్టింది. ఆస్ట్రేలియా రాజ్యాంగం 9 సంవత్సరాలు తీసుకుంది. దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగం సంవత్సరంలోనే తయారయింది. అయినా యీ రాజ్యాంగాలన్నీ మన రాజ్యాంగంకంటే చాలా చిన్నవి. అదీకాకుండా వాటికి ఇన్ని సవరణలుగూడా వచ్చిన పాపాన పోలేదు. అమెరికా రాజ్యాంగంలో 7 అంశాలు మాత్రం వున్నాయి. కెనడియన్ రాజ్యాంగం 147 అంశాలది. ఆస్ట్రేలియా రాజ్యాంగంలో 128 అంశాలు వున్నాయి. దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగం 153 అంశాలతో కూడివుంది. ఈ అన్ని విషయాలు సభ్యులకు తెలిసివుంటే, పరిషత్తుకాలాన్ని వృథా చేసింది లేనిది; డబ్బునష్టదుబారా చేసింది లేనిది; తెలిసివస్తుంది.

నజీరుద్దీన్‌అహ్మద్ రచనాసంఘాన్ని దిగజారుడు సంఘంగా వర్ణించారు. ఆయన ఎంతహేయంగా మమ్మల్ని వర్ణించినా, అది పొగడ్తగానే నేను భావిస్తున్నాను. ఎందుచేతనంటే మేం మెట్టుదిగజారినా, స్థితి అదుపులో వుంచుకొనే దిగజారాము. లోతు తెలిసి కావలసిన విషయాలను సాధించడం కోసం దిగజారాం. నిజంగా తాను ప్రవేశపెట్టిన సవరణలు సరియైనవి కావని తట్టినప్పుడు, రచనాసంఘం వాటిని ఉపసంహరించుకోక పోయినట్లయితే, ఆ సంఘం మర్యాదనుమించిన్నీ, బాధ్యత తెలియకుండానున్నూ వ్యవహరించినట్లయ్యేది.

అదీకాకుండా ఒక్క అహ్మద్ తప్ప ఇంకా ఎవ్వరూ ఈ మాట అనవందుకున్నా, రచనాసంఘం చేసిన కృషిని హర్షించినందుకున్నూ, నేనుగూడా హర్షిస్తున్నాను.

నన్ను చాలామంది స్తుతించారు. అందువల్ల నేను వివశుణ్ణికూడా అయినాను. నిజానికి నేను నిమ్న జాతుల హక్కులను రక్షించుకోవాలనే ఈ ఉద్దేశంతో నేరాజ్యాంగ పరిషత్తులో ప్రవేశించాను. అటువంటి సందర్భంలో పరిషత్తు నాయందు ఇంతటి నమ్మకాన్ని వుంచి, దేశానికి యీవిధంగా సేవజేయగల సావకాశాన్ని కల్పించినందుకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

ఈసందర్భంలో నేను రాజ్యాంగ పరిషత్తు కాంగ్రెసు పార్టీ వారికి గూడా ధన్యవాదాలు అర్పించవలసివున్నది. అదే గనుక కాకపోతే, ఏవర్గానికి ఆ వర్గమే గొప్పదియై, క్రమశిక్షణలేక, పరిషత్తు పునాదులు సరిగ్గాలేని యిల్లులాగా, హద్దు పద్దు లేని ప్రజల సమూహంలాగా వుండి రచనాసంఘం వారి కార్యభారాన్ని మూడింతలుగా పెంచివుండేది. అట్టి అరాచకం ఇక్కడ పాలనసాగించి వుండేది. పరిషత్తు కాంగ్రెస్‌పార్టీ అంటూవుండటంచేత ఇక్కడ క్రమశిక్షణ, పద్ధతి ఏర్పడ్డాయి.

ఇట్లా అని నేను శ్రీ కామత్, డా॥ దేశ్‌ముఖ్, సిద్వాలవంటి విప్లవమూర్తులను గూడా విస్మరించకుండా పూరుకోలేను. వీరితోపాటు పండిట్ భార్గవ, ప్రొఫెసర్ కె. టి. షా, పండిట్ హృదయనాథ కుంజ్రూలవంటివారినికూడా విస్మరించాలి. వీరుగనుక లేకపోతే పార్టీ క్రమశిక్షణవల్ల అంతా ప్రతిదానికి తలలూపేదేంగా తయారైవుండేవాళ్లు.

ఇక పరిషత్తు అధ్యక్షులు వున్నారు. వారు అతిసమర్థులు. వారినికూడా నేను అభినందిస్తున్నాను. వీరితోపాటు చిత్తు రాజ్యాంగాన్ని సిద్ధంచేసిన సర్ బి. ఎన్. రావును హర్షించితీరాలి. ఆయనతో పాటి నాడే ప్రధాన ముసద్దీ శ్రీ ఎస్. ఎన్. ముఖర్జీగూడా. పోతే రచనాసంఘ కార్యాలయోద్యోగులు వున్నారు. వారు ఒక్కొక్కప్పుడురాత్రి రెండుగంటలు దాకా పనిచేయవలసి వచ్చేది. వారికి గూడా నాధన్యవాదాలు.

ఇక రాజ్యాంగ విమర్శకు మళ్లవద్దాం. కొంతమంది ఇందులో అధికారమంతా కేంద్రాధీనమైపోతున్నదని విచారించారు. రాష్ట్రాలకు ఈ రాజ్యాంగం మున్సిపాలిటీల క్రిందకు మార్చి వేసిందని అన్నారు. అసలు ఫెడరలిజం యొక్క విశిష్టతఅంతా అధికారాన్ని కేంద్రానికి రాష్ట్రాలకు మధ్య పంపకంలో వుంది. ఈ సూత్రం భారత రాజ్యాంగంలో అతి ప్రస్ఫుటంగా ఇమిడి వుంది. దాంట్లో లోపమేమీ లేదు. అందువల్ల రాష్ట్రాలకు కేంద్రానికి సామంతాలుగా చేసామన్న మాట పరియైనది కాదు. ఈ హద్దును శాసనకేంద్రము మార్చలేదు. న్యాయశాఖ అంతకన్నా చేయలేదు.

కాగా ఇప్పుడు కేంద్రం చేతుల్లో విశేషాధికారాలను వుంచినట్లు కనపడినా, అది విపరీత సమయాలలో తప్ప మరెప్పుడూ ఆఅధికారాలను వినియోగించేసావకాశం ఈ రాజ్యాంగంలో ఎక్కడాలేదు. నిజానికి అటువంటి విపరీతపరిస్థితులే దేశంలో ఏర్పడితే, ప్రజలు కేంద్రాన్ని అనుసరించవలసివుంటుంది గాని, రాష్ట్రాన్ని కాదు. ఇది బహుజనాభిప్రాయంగూడాను.

ఇక భవిష్యత్తును గూర్చి ఆలోచిద్దాం. 1950 జనవరి 26 వ తేదీ నాడు దేశం సర్వస్వతంత్రం కాబోతున్నది. ఈ స్వాతంత్ర్యానికి ఏమి సంభవిస్తుంది? భారతదేశం ఆస్వాతంత్ర్యాన్ని రక్షించుకుంటుందా! దుసికిల పడుతుందా? ఇండియా ఇంతకు పూర్వం స్వతంత్రతను కోల్పోయినప్పుడు, కొంతమంది దేశీయులే అందుకు కారకులైనారు. దీన్ని తలచుకొని నామనస్సు క్షోభిల్లుతున్నది.

ఆదిలో సింధు దేశంమీద మహమ్మద్ బిన్‌ఖాసిం ఎత్తి వచ్చినప్పుడు సింధురాజు దాహర్ సేనానులు, ఖాసిం ఇచ్చిన లంచాలు తిని, దేశాన్ని అతనికిఅమ్మివేశారు. తరువాత మహమ్మద్‌ఘోరీ వచ్చాడు. అప్పుడు జయచంద్రుడనేవాడు, పృథ్వీరాజును కాదని, గోరీతోను, సోలంకిరాజులతోను చేతులుచేతులు కలిపి, త్రాగిన రొమ్మునే గ్రుద్దాడు. అనంతరం శివాజీ దేశ స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించిపోరాడుతూవుంటే, కొంతమంది మహారాష్ట్రులు, రాజపుత్రులు మొగలులతో చేతులు కలిపి, అతని కార్యక్రమం క్రింద గోతులుతీశారు. బ్రిటిష్‌వాళ్లు వచ్చి, దేశంలో సిక్కు రాజ్య నిర్మూలనకు బద్ధకంకణులై మిత్రి వారి ప్రవర్తిస్తూవుంటే గులాబ్‌సింగ్ చేతులు ముడుచుకు కూర్చున్నాడు. ఆఖరికి 1857 వచ్చింది. భారతప్రజ తొలిసారిగా బ్రిటిష్‌వారిమీద ధ్వజం ఎత్తి స్వాతంత్ర్యంకోసం పోరాటం ప్రారంభించింది. అప్పుడు సిక్కులు తలవెంట్రుక కదలనట్లు వూరుకొని, ఆవిప్లవం విశ్లథ మాటకు దారితీశారు.

తిరిగి ఇదేకథ పునరావృతమవుతుందా? అని నాకు భయం వేస్తున్నది. ఇది నా మనస్సును ఆందోళితం చేస్తున్నది. దేశంలో మనకు కులాలపేరిట, మతాలపేరిట జనిసిన విరోధశక్తులు ఇంకా అట్లాగే వున్నాయి. వాటికితోడు రాజకీయ విశ్వాసాలు పెరిగిపోతున్నాయి. భారతీయులు ఈ విశ్వాసాన్ని దేశంకంటే ఎక్కువగా గణిస్తారా? లేక విశ్వాసంకంటే దేశాన్ని ఎక్కువగా గణిస్తారా? ఆ సంగతి నాకు తెలియదు. ఇదిగూడా నా ఆందోళనకు దోహదాన్ని ఇస్తున్నది. కాని ఒక్కటి చెప్పదలచుకున్నాను. ఏ రాజకీయపక్షమైనా దేశంకంటే విశ్వాసమే ఎక్కువైనదని భావిస్తే మనం సాధించిన స్వాతంత్ర్యం దెబ్బతింటుంది. ఇక తలఎత్తటం వుంటుందో వుండదో అని నా అనుమానం.

ఈ పతనం రాకుండా మనం మనల్ని రక్షించుకోవాలి. అందుకు మన రక్తాన్నంతా ధారపొయ్యాలి.

1950 జనవరి 26 వ తేదీనాడు మనం సర్వ స్వతంత్రులం అవుతున్నాం. ఆ రోజున దేశంలో ప్రజలకోసం, ప్రజలచేత, ప్రజలప్రభుత్వం ఏర్పడుతుంది. అప్పటికి నా మనస్సులో ఆ భావమే ఆడుతూ వుంది. మనం ప్రజాస్వామ్య వ్యవస్థను రక్షించుకుంటామా? దాన్ని మనం పాలించుకుంటామో?, దుసికిల పడతామో తెలియకుండా వుంది.

ఇండియాలో ఒకప్పుడు పలు ప్రజాస్వామ్యాలు వుండేవి. రాజరికాలు వెల్లబడి అవుతున్న చోట్లలోగూడా ప్రజాస్వామ్యం పుష్కలంగావుండేవి. అటువంటి చోట్లవారిని ఎన్నుకొన్నా, ఎన్నుకునేవారు లేదా ఆ అధికారాన్ని పరిమితింఅన్నా చేశారు. అప్పుడుగూడా ప్రజాస్వామ్య సంప్రదాయాలు, ఇప్పటికన్నా ఎక్కువగా అనులులో వుండేవి.

కాని ఇప్పుడు అది ఇండియాలో నశించిపోయింది. అందువల్ల తిరిగి ఇప్పుడు ఆ ప్రజాస్వామ్యాన్ని అవలంబింపజేస్తూవుంటే, ప్రజలకు దాని లాభం గానేగా కనబడుతుంది. దీంట్లోనే అది నియంతృత్వానికి దారితీసే చిహ్నాలు గూడా ఉన్నాయి. తినంతతానుగా ఆ నియంతృత్వాన్ని తెచ్చి నెత్తిమీద పెట్టుకోవడం ఇక్కడ అసాధ్యంకాదు. ఆ కారణంచేత, ఒక తప్పటడుగువేస్తే, అదివచ్చి పడుతుంది.

అందువల్ల ప్రజాస్వామ్యాన్ని రూపంతోనే కాక, శరీరంతోగూడా కాపాడుకోవాలంటే మనం ఎప్పుడూ ప్రజాస్వామ్య ధర్మహితమార్గాలను వదిలిపెట్టగూడదు. ఇది నా మొదటిసూచన.

రెండోదాన్ని జాన్‌స్టూఆర్టు మాటల్లో చెబుతాను. ఆయనఅన్నాడుగదా, నాయకుడు ఎంతగొప్పవాడైనా, ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని ఆయన పదాశ్రితం చెయ్యకూడదు అని. అట్లాచేస్తే, అంతవరకు ప్రజాహితమార్గములైన సంస్థలను స్వీయ అధికారగ్రహణమార్గాలలో అతడు వినియోగించుకోగలడని ఆయనఅన్నారు.

మూడోది, మనం మనకు లభించిన రాజకీయ స్వాతంత్ర్యంతో తృప్తి పడి వూరుకోరాదు. ఆర్థిక సామాజిక స్వాతంత్ర్యం కోసం గూడా కృషి చెయ్యాలి. ఈ రెండూ ఇండియాలో ఇప్పుడు పూర్తిగ లుప్తమై వున్నాయి.

నాల్గోది ఇంతకాలం మనదేశంలో రాజకీయమైన అధికారం, ఏ కొద్దిమంది చేతుల్లోనో వుంటూవచ్చింది. దాన్ని వారు సత్తినొన్నట్లు వ్యవహరించేవారు. తక్కినవాళ్లు వాళ్ల దృష్టికి చాలా హీనంగా కనపడేవారు. అందువల్ల అతక్కిన వాళ్ళందరకు బ్రతకడంలో వున్న పైశ్వర్యం గోచరించిందికాదు. ఉన్నతమైన జీవితాన్ని గడపడం గూడా సాధ్యమైందికాదు. అందువల్ల వారికిజాతీయజీవనంలో తగిన స్థానం కల్పించాలి. ఆకొద్దిమంది పెత్తనం తొలగిపోవాలి. లేకపోతే దేశంలో ఈ విపరీతస్థితి వర్గపోరాటానికి దారితీస్తుంది. అప్పుడిక అంతా సర్వనాశనమే.

అందువల్ల దేశంలో ఇతర తమభేదాన్ని ఎంత త్వరలో రూపుమాపితే అంత మంచిది. అందువల్ల దేశానికి, దేశం సాధించిన స్వాతంత్ర్యానికి, అది నెలకొల్పిన ప్రజాస్వామ్యధర్మభావానికి విజయం చేకూరుతుంది. దేశంలో సమానత్వమూ, సౌభ్రాతృత్వమూ ప్రవృద్ధమై, దేశం భోగభాగ్యాలతో విలసిల్లుతుంది.

---

## ప్రాజెక్టుల నిర్మాణం: నెహ్రూ వివరణ

(11-వ పేజీ తరువాయి)

నది. ప్రతిసమస్యను మనం అంతర్జాతీయ దృష్టితో పరిశీలించ లేకపోయినా, కనీసం సంకుచితరాష్ట్రాభిమాన బద్ధులం గాకుండా యావద్భారతదేశీయ దృష్టితోనైనా పరిశీలించడం అలవర్చుకోవాలి. మనం వేసుకొన్న పథకాలలో ఏదిముందు ఏదివెనుక అన్నది వాటివాటి ప్రాధాన్యాన్ని బట్టి నిర్ణయించాలి; గాని ప్రాంతీయదృష్టి పనికిరాదు. ఇండియాలో పారిశ్రామికాభివృద్ధి 70 ఏళ్ళక్రిందట ప్రారంభమైనా, ప్రధానమైన ప్రాతిపదిక పరిశ్రమ లేవీ ఇంతవరకు దేశంలో ఏర్పడలేదు. జపాను రష్యాలవలె మనం అన్నింటా స్వయం పోషకం కావాలి పరిశ్రమలన్నిటికీ ఆధారభూతమై జనకపరిశ్రమలైన ఉక్కు, యంత్ర పరికరాల పరిశ్రమలను అభివృద్ధి చేయడమే మన ప్రథమ ప్రధాన తమకర్తవ్యం. ఇండియా అంత ప్రకృతి సంపదలు గల దేశం ప్రపంచంలో ఇంకొకటిలేదు. ఈ ప్రకృతి సంపదలను వెలార్చి వినియోగ పరచుకోవాలంటే సహకారము సమన్వయము సాంకేతికజ్ఞానము అవసరం. కాని పారిశ్రామికులు ఎంతసేపటికీ డబ్బు చేసుకోవాలన్న దృష్టితో పనిచేస్తున్నదే గాని దేశాన్ని అభివృద్ధి పరచాలన్న ఆలోచన కనపరచడంలేదు. బ్రిటిష్‌వారి హయాములో ప్రజలకు ప్రభుత్వానికిమధ్య ఏర్పడ్డ అవరోధం ఇంకా పూర్తిగా తెగలేదు". భాషా సమస్యగూర్చి ప్రస్తావిస్తూ, దేశంలో ఇంగ్లీషుభాష నేర్చినవారు ఎరగని వారు అనే రెండుతరగతుల ప్రజలున్నారనీ, మొదటి తరగతిప్రజలు ప్రభుత్వోద్యోగాలన్నీ గుత్తకు తీసుకోవాలని ప్రయత్నిస్తున్నారనీ, చెప్పెను. దేశంలోఉన్న ప్రతి బాలబాలికకు విద్యను అభ్యసించడానికి అవకాశం కల్పించాలన్నదే తమ లక్ష్యమనీ, యు. పి. ప్రభుత్వం ఈ విషయంగా చేస్తున్న ప్రయత్నం ప్రశంసనీయమనీ పండిట్ నెహ్రూ అనెను.

రాజకీయ మతాలూ, సిద్ధాంతాలూ దేశంలోఉన్న ఐశ్వర్యాన్ని ఎలాపంపకం చేయాలి అన్న ప్రశ్న పరిష్కరించడానికి ఉపకరిస్తవనీ, మన దేశం ఇంకా ఈ మతాలగురించి ఆలోచించ దగినంత సంపన్నస్థితికి రాలేదనీ, పండిట్ నెహ్రూ చెప్పెను. దేశంలో జరుగుతున్న ఉత్పత్తే దేశ ఐశ్వర్యానికి మానమనీ, కాబట్టి ఉత్పత్తిని అభివృద్ధి చేయడమే మన ప్రధాన కర్తవ్యమనీ పండిట్ నెహ్రూ అనెను. ఇంజనీరింగు విద్యార్థులు దేశ సహజసంపదలను వినియోగంలోకి తేవడానికి తీవ్రకృషి చేయాలి అని ఆయన ఉద్బోధించెను. థామ్సన్ కాలేజీ 1847 లో స్థాపించబడింది. ఈ కాలేజీ యిప్పుడు విశ్వవిద్యాలయంగా మార్చబడినది. ఈ స్నాతకోత్సవానికి హార్వర్డు విశ్వవిద్యాలయం తరఫున ఒక ప్రతినిధి వచ్చెను.

# "తుపానులో దెబ్బతిన్న ఆంధ్రులకు సహాయపడడం మనవిధి"

## షరీఫ్ ఏర్పాటుచేసిన నగరసభలో గవర్నరు

## భావనగరు మహారాజా ఉద్బోధ

మదరాసు, నవంబరు 26: "ఆంధ్ర దేశంలో తుపానువల్ల నష్టపోయిన వారికిసహాయముచేయుట ఔదార్యంచూపుట, దయదలచుట గాదు, మనవిధి నెరవేర్చుటే అగును. ఇంతకాలం యితర జిల్లాలకు ఆ ప్రాంతం ఆహారధాన్యాలు సప్లయి చేసింది. ఇపుడు వారికి ఇతర దేశీయులందరు సహాయం చేయవలసిన విధి యేర్పడినది." అని మదరాసు గవర్నరు భవనగరు మహారాజాగారు నిన్న సాయంకాలం షెరిఫ్ ఏర్పాటుచేసిన బహిరంగ సభకు అధ్యక్షతవహించి విన్నవించిరి. తుపాను బాధితుల ఎడ సానుభూతితెల్పు తీర్మానం ప్రధాని ప్రతిపాదించెను.

సహాయం చేరగోరుచు, "గవర్నరు ఆంధ్రాసైక్లోను రిలీఫ్ నిధి నేర్పాటుచేసి దాన్ని నిర్వహింప పలుకుబడిగల పెద్దల ఉపసంఘాన్ని నియమించవ"లెనను తీర్మానమును మంత్రిసీతారామరెడ్డిగారు ప్రతిపాదించిరి.

### సభలోనే 23 వేల రూపాయల విరాళాలు

సభకు జడ్జీలు, ఉద్యోగులు పురపెద్దలు శాసనసభ్యులు పలువురు విచ్చేసిరి. సభలో ప్రొత్తచందాలు మొత్తం 23000 ప్రకటించబడెను. అదివరకు 90,000 వసూలయినట్లు గవర్నరుగారు ఉపన్యాసమునందు తెలిపిరి. సి. ఆర్. శ్రీనివాసనుగారు అరవంలోను తక్కినవారంతా ఇంగ్లీషులో ఉపన్యసించిరి.

### నిధి నిర్వహణ సంఘం

ఈ దిగువవారు నిధినిర్వహణసంఘంగా ఎన్నుకోబడిరి:— గవర్నరు గారు పాట్రను, గౌ॥ పి. కుమారస్వామిరాజా, ప్రధాని, అధ్యక్షులు, ఉపాధ్యక్షులు— చీఫ్ జస్టిసు పి. వి. రాజమన్నారు, గౌ॥ బి. గోపాలరెడ్డి, గౌ॥ హెచ్. సీతారామరెడ్డి, రత్నసభాపతి మదల్యారు. ప్రధాన కార్యదర్శి, సి. ఎం. కొఠారీ (షెరీఫ్), కార్యదర్శులు గోవిందస్వామినాథను, వి. కె. రావు, ఐ. సి. ఎస్. కోశాధికారి కె. ఎం. రాజరత్నంగార్లు. సభ్యులు యీ దిగువ 51 లో 14 గురు తెలుగువారు కలరు:—గౌ॥ బి. రామకృష్ణరాజు, జె. శివషణ్ముగంపిళ్లె, ఎం. భక్తవత్సలం, కె. మాధవమీనను, కె. చంద్రమౌళి, డా॥ ఎ. లక్ష్మణస్వామిమదల్యారు బి. ఎస్. కృష్ణ, మేయరు, షరీఫ్, ఎన్. జి. రంగ, కె. కామరాజనాడారు, శేలప్పను, టి. ప్రకాశం, వి. కె. జాను, జనాబు మహమ్మదు ఇస్మేలు, కె. శ్రీనివాసను, రామనాథగోయంకా, సి. ఆర్. శ్రీనివాసను, ఎస్. అనంతరామకృష్ణను, శంభుప్రసాదు, రాజా సరి ముత్తయ్య చెట్టి, బొబ్బిలిరాజా, ఎస్. ఎస్. వాసను, బి. బాబిలను, టి ఎ. రామలింగ చెట్టియారు, ఎనుగుప్ప చెట్టి, గుంటూరునరసింహరావు, ఎల్. పటేలు, ఎం. బాలసుందర ముదల్యారు, టి. జి. ఆరముస్ట్రాంగు, అ. గోపాలకృష్ణయ్య, బి. వెంకటరత్నం, పైడి వెంకటనారాయణ, జి. వెంకటరెడ్డి, కుప్పుస్వామిచౌదరి, శ్రీమతి అమ్మన్నరాజా, కుట్టినూరు అమ్మాళ్, కబురాలాసతి, బీగం సాజిరు హుస్సేను, ఎస్. ఎల్. దాదా, కె. రాముణ్నిమీనను, ఎం. వి. సుబ్రహ్మణ్యం, పి. గోవిందన్నాయరు గార్లు.

గవర్నరుగారిని అధ్యక్షత వహింపగోరుచు షెరీఫ్ సి. ఎం. కొఠారిగారు, తమ పాయాంలో యీ దుస్థితి కలుగుట కడు విచారకరమనియు, ఆంధ్రదేశంలో ప్రజలకు కలిగిన నష్టం అపారమనియు, వారు తిరిగి తమ పూర్వస్థితికి వచ్చేటట్లు యితర దేశీయులందరు తోడ్పడవలసియున్నదనియు చెప్పిరి.

గవర్నరుగారు, ఏడాదినుండి తాను ఎన్నో సభలకు అధ్యక్షత వహించితినిగాని యింత విచారకరమగు సభ కధ్యక్షత వహించలేదనిరి. ఇది జాతియంతకు కలిగిన విషాదము. ఇప్పటి కింకా నష్టంయొక్క పూర్తి వివరాలు తెలియరాకున్నవంటే, ఎంతయెక్కువ నష్టం కలిగిందో ఊహించుకొనవచ్చును. ఒకప్పుడు రాష్ట్రమంతకు గిడ్డంగులవలె నుండిన కృష్ణ, ఉభయ గోదావరి, గుంటూరు, విశాఖపట్నం జిల్లాలు యిపుడు అన్నానికి చేయిజాచవలసి వచ్చింది. పేదవారికే యెక్కువనష్టం కలిగింది. వారికి కలిగిన నష్టం పోయింది. జీవనాధారం గోల్పోయిన వారికి మనము సహాయం చేయుట మనవిధి. ఎంత తక్కువగ తోడ్పడ కలిగినను ప్రతివారు యిందుకు తోడ్పడి తమవిధి నెరవేర్చుకొనవలెను.

ప్రభుత్వంవారు అప్పుడే కొంతసహాయము చేసిరి. కాని అది ఏమాత్రము చాలదు. ప్రభుత్వంవారిపైనేగాక, ప్రజలందరిపై యీ బాధ్యత గలదు. మదరాసుగవర్నరు శ్రేయనిధివారు యీనెల మొదలు తేదీన గవర్నరు ఆంధ్రసైక్లోను సహాయనిధి ప్రారంభించిరి. ఇప్పటికి రూ॥ 90,000 లు వసూలయింది. చందాలిచ్చిన వారందరికి కృతజ్ఞత తెల్పుచున్నాను. మదరాసులోని క్లబ్బువారిని నేకోరగా ఒకరోజు రాబడి యిస్తామన్నారు. ఈ నిధికి గొప్పవారు మాత్రమే యివ్వాలని లేదు.

ప్రతిదమ్మిడీయు స్వీకరింతుము. ప్రతిగ్రామానికి చేరగల శాఖాసంఘాలతో సహాయ సంఘములు స్థాపించి పనిచేయుదురు. ప్రత్యేకనిధి గానున్నా రాష్ట్రీయ శ్రేయనిధిలో భాగంగానే యుండును. దీనికిఇచ్చిన డబ్బు రాబడిపన్ను నుండి మినహాయించబడును.

చేయవలసిన పని బ్రహ్మాండమయినది. ఇంతవరకేదో ప్రారంభించితిమి. దీని ఈ రాష్ట్రంవారేకాక, అన్ని రాష్ట్రాలవారు తోడ్పడి, ఆంధ్రదేశమునందు బాధపడుచున్న వేలాదిజనమునకు సహాయపడవలెనని కోరుచున్నాను" అని గవర్నరుగారనిరి.

అమృతాంజనం కంపెనీవారు రూ 5000, కొఠారి అండు సన్సు రూ 2500, గుంటూరు పవరు సప్లయి కంపెనీవారు రూ 1000 చందాలిచ్చిరని షెరీఫ్ గారు ప్రకటించిరి.

ప్రధాని కుమారస్వామి రాజా గారు తుపానుబాధితులకు మదరాసు పౌరుల హృదయపూర్వకమగు సానుభూతి తెల్పుచు తీర్మానమును ప్రతిపాదించుచు యిట్లు పన్యసించిరి.

"ఆహార సప్లయికి లోటు కలిగించిన యీ ఆంధ్ర దేశమునకు కలిగిన విషాదం దేశమంతకు కలిగిన కష్టంగా ఎంచవలెను. మన సాంప్రదాయానికి తగిన ధర్మగుణము విశ్వాసము చూపి తోడ్పడవలెను. ఇట్టి విషాదము యిదివరకెన్నడు కలుగలేదు. నెల క్రిందట కలిగిన వరదల వెంటనే, యీ తుపాను వచ్చుటవలన మరీ ఎక్కువ నష్టం కలిగింది. జన పశు పంట నష్టం అపారము. రోడ్లు తెగినవి. ప్రజలు వినరాని కష్టాలు పడినట్లు తెలిసెను. దక్షిణాదిని వర్షలేమిచే పంటలు పోతుండగ ఉత్తరాదిని తుపానుచే రాష్ట్రము నష్టస్థితి యేర్పడుచున్నది. దేశమంతయు ఆహారలేమిచే బాధపడుచున్న ఈ తరుణమున అదనంగాపంచే ఆంధ్రదేశమునకు యీ విపత్తుసంభవించుట భారతజాతియంతకు విషాదకరమయిన విషయం.

"తుపాను దెబ్బతిగలక బయటనున్న వారమను మనమంతా వారికి సహాయం చేయుట మననైతికబాధ్యత అయివున్నది. పేదవారికే యిండ్లసముపాయం చేయాలి. రోగాలురాకుండా చేయాలి. వ్యవసాయదారులకు తిరిగి వ్యవసాయం చేసుకొనుటకు అన్నివిధాల సహాయపడాలి. ప్రభుత్వంవారు చేయగల్గినదంతా చేస్తున్నారు. ప్రజలుగూడా కలిగిన నష్టాన్ని గమనించి శక్తివంచనలేక తోడ్పడవలెను." అని ప్రధాని కోరెను.

డా॥ వి. కె. జానుగారు, కౌన్సిల్ లో ప్రతికూలపక్ష నాయకులు తీర్మానాన్ని బలపరుస్తు, భూమిమీదనున్న దంతా తుడిచివేసి, సముద్రాన్ని తెచ్చి భూమిమీద పెట్టింది యీ తుపాననిరి.

ప్రభుత్వమువారు యీసారి చాల ప్రశంసనీయంగా శక్తివంచన లేక సహాయ కార్యములకు గడంగిరి. సహాయకార్యమంతా ప్రభుత్వంవారు చేయజాలరు. చేయగలిగినా చేయరాదు. ప్రజలు తోడ్పడుట వారివిధి ఒకరాష్ట్రానికి కష్టంవచ్చిన యితరాష్ట్రాలు తోడ్పడి తమ సానుభూతిని మాటలలోగాక, ద్రవ్యరూపమున చూపాలి" అని చెప్పిరి. ఎం ఎస్. మజీదు, సి. ఆర్. శ్రీనివాసనుగార్లు తీర్మానమును బలపరచిన పిమ్మట తీర్మానం అంగీకరించబడెను.

### వెంటనే తోడ్పడాలి

గౌ. సీతారామరెడ్డిగారు "తుపానువల్ల నష్టంఅపారంగావిశాలప్రదేశమునందుకలిగినందున జనులంతా గవర్నరు తుపాను సహాయనిధికివిరివిగా చందా లివ్వాలి. చందాలు వసూలుచేసి నష్టపడిన వారికి పంచుటకై ఒక సంఘం నియమించాలి." అను తీర్మానమును ప్రతిపాదించిరి.

"తుపానువార్త తెలియగానే ప్రభుత్వంవారు రూ 2½ లక్షలు సహాయం చేసిరి. తరువాత 12 లక్షలు పంపిరి. జిల్లా కలక్టరుల రిపోర్టులు రాగానే, జలాధారాలను కాపాడే కార్యక్రమం అతి చురుకుగా పబ్లికువర్క్సుశాఖవారు జరిపించుచున్నారు. ఆహార వ్యవసాయ, ఆరోగ్యశాఖలవారుకూడ శక్తివంచనలేక పాటుబడుచున్నారు.

ప్రజలకు ఆశ్రయమిచ్చి అన్నంపెట్టే సహాయ స్థానిక అధికారేతర సంఘాలు చేయుచున్నవి. ఈ పనులన్నింటికి బయటివారి సహాయంకూడ కావలసియున్నది.

నష్ట వివరాలు: 58 లక్షల విలువగల పశువులు, 1½ కోట్ల విలువగల గుడిసెలు, 10½ కోట్ల పంటలు, 15½ కోట్ల కొబ్బరితోటలు, 10 లక్షల విలువగల అరటి, చెరకుతోటలు రూ 13½ లక్షలు, పసుపు రూ 10½ లక్షలు పడవలు వలలు రూ 1 లక్ష నష్టమయినవి. మొత్తం నష్టం స్థూలంగా రూ 28 కోట్లుండును. ఇంకా ఎక్కువే జరిగియుండునని పత్రికలలో ప్రజల వార్తలవల్ల తెలియుచున్నది: ఎంత మొత్తం నష్టమని తర్జనభర్జన చేయడం కన్న, వెంటనే ఎట్టి సహాయం చేయాలని ఆలోచించాలి.

ఈ ప్రాంతంలోనే 1938 లో గూడ తుపాను వచ్చి యీ విధంగానే నష్టం వచ్చిందని రికార్డులవల్ల తెలిసినది.

ఇండ్లు కట్టుకొనుటకు, బట్టలకు పసువులకు ధన సహాయం కావాలి. వడ్డీలేని ఋణాలు ప్రభుత్వం వారిచ్చినా తీర్చలేని రయితులు చాల మంది యుంటారు. వారికి ఉచితంగా యివ్వాలి.

ఈ విషాదం దైవకృతం. ప్రజల పాపమేమీ లేదు. కనుక బాధితులకు భారతదేశంలో అందరు వెంటనే నిధిగా తోడ్పడవలెను. ఇచ్చే చందాలు వెంటనే యివ్వాలి." అని రివెన్యూ మంత్రిగారు నుడివిరి.

కె. సి. పి. లిమిటెడు వుయ్యూరు చక్కెర ఫాక్టరీవారు రూ 11000 (అదివరకు 5000 కాక) రామకృష్ణగారు రూ 1000 యిచ్చిరని షెరీఫ్ గారు ప్రకటించిరి. డా॥ వి. కె. జానుగారు రూ 1000.

డా॥ ఆ. లక్ష్మణస్వామి మదల్యారుగారు తీర్మానమును బలపరచుచు, కలిగిన విషాదం మాటలతో వర్ణింపవగినదికాదని, ఆరోజులలో విమానంపైపోతూ ఆప్రాంతాలు చూచినందుకలన తెలిసినదనిరి. ప్రతివారు చేసే సహాయం వెంటనే చేయుటచాల అవసరమనిరి. విద్యార్థులు తమసాయంకాల వినోదాలు ఒక్కరోజయినా మాని యీనిధికి చందాలిచ్చి యితరులవద్ద వసూలుచేసి తోడ్పడవలెనని కోరిరి.

ఉగ్రాణం గారు బ్రిటిషువారులందరివలెను సానుతాపము తెలిపి, తమకంపెనీ పనివారు 14 మంది యిండ్లుపోగా సహాయం చేసితిమనిరి. యీరోజుల్లో విమానవాకల్ల జరిగేనష్టంకంటేనష్టం యిపుడు కలిగిందనిరి.

శ్రీమతి అమ్మన్నరాజాగారు తుపాను గోజునకాకినాడలో ఉండిపోయి, నాల్గురోజులు గడచినాక ఆప్రాంతాలన్ని చూస్తు మదరాసు చేరేసరికి, రైలులో యిటూ అటు సర్వదా పచ్చగా పండిన పొలాలు, యిపుడు నీటమునిగి, యిండ్లన్ని పడిపోయిన కనబడేసరికి చాల దుఃఖం కలిగిందనిరి. పభుత్వోద్యోగులు వెన్వెంటనే ఎన్ని కష్టాలకైన ఓర్చి సహాయ కార్యములు చేసిరనియు, రంగా, కళా వెంకట్రావుగార్లు మార్గం ఉన్నది లేనిది చూసుకోక అచ్చోటికి వెంటనే పోయి అంచనాలువేసి తెలిపిరనియు, ఎంత సహాయం చేసిన చాలదనియు, తెలిపిరి. ఆంధ్రమహిళా సభవారు వెంటనే వసూళ్లు ప్రారంభించి రూ. 10000 దాకా వసూలు చేసిరనియు, గవర్నరు నిధి స్థాపించి షెరీఫ్ గారు వసూలు చేయుట ప్రారంభించగానే వసూళ్లు నిలిపివేసిరనియు తెలిపిరి. అందు గోపాలరెడ్డిగారు 500 తెలిడకులు చందా లిచ్చియుండిరనిరి.

తీర్మానం అంగీకరించబడెను.

గుజరాతీస్త్రీ మండలివారు రూ. 301 యిచ్చిరని షెరీఫ్ గారు ప్రకటించి సభ ముగించిరి.

### తుపాన్ బాధితులకు సహాయం

#### నాటకప్రదర్శనంద్వారా 20 వేలు వసూలు

పామర్రు, నవంబరు 23: వరదబాధితుల సహాయార్థం, యిచ్చట, యిటీవల "పాదుకా పట్టాభిషేకం" అను నాటకము యేర్పాటుచేయబడి, తద్వారా రు. 20,779/- వసూలు చేయబడినది.

కొంతమంది శ్రీమంతులు, వర్తక ప్రముఖులు అధికారులు, అనధికారులు చాలామంది సహాయపడ్డారు. స్వ. వి.

## తుపాను బాధితులకు సహాయం

### రాజమహేంద్రవరం తాలూకా సంఘం ఏర్పాటు

రాజమహేంద్రవరం, నవంబరు 24:- ఈ తాలూకా ప్రముఖులు నిన్న సాయంత్రం సబ్ కలెక్టరు టి. యన్. లక్ష్మీనారాయణన్ గారి అధ్యక్షతను సమావేశమై తాలూకా తుపాను బాధితుల సహాయ సంఘము నేర్పరచిరి. దీనికి సబ్ కలక్టర్ గారధ్యక్షుడుగను, తాసిల్దార్ ఆర్. సత్యనారాయణగారు కార్యదర్శిగను, అలపాటి భాస్కరరామయ్యగారు కోశాధికారిగను ఎన్నుకొనబడిరి. డాక్టర్ ఏ. బి. నాగేశ్వరరావు (పురపాలక సంఘాధ్యక్షుడు), డాక్టర్ కె. యల్. నరసింహారావు (పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు), నీమకొండ వెంకట రామారావు, వన్నేటి సత్యనారాయణ మున్నగు ప్రముఖులతో ఒక ఉపసంఘముకూడ ఏర్పడెను.

సబ్ కలెక్టరు గారు ఈ ప్రాంతపు తుపాను నష్టములను గురించి తెలియజేయుచూ, రామచంద్రపురం తాలూకాలో 416 గృహములు, రాజమండ్రి తాలూకాలో 80 గృహములు కూలిపోయినవనీ, ప్రభుత్వము వారీ ప్రాంతమునకు మంజూరు చేసిన పదివేల రూపాయలు పూర్తిగా ఇండ్లు పడిపోయినవారిక్కి ఒక్కొక్కరికి 20 రూ॥లు చొ॥న పంచియిచ్చితిమని తెల్పిరి. ఈ సహాయ సంఘము లెవ్వున కనీసం ఒకటిన్నర లక్షల రూపాయలైనా వసూలు చేయవలెననీ, డిసెంబరు ఆఖరులోగా యిది పూర్తికావలెనని తాము ఆశించుచుంటిమనీ గూడ సబ్ కలక్టరు గారు అనిరి. (స్వ. వి.)

## ఆంధ్రప్రాంతంలో రామకృష్ణ మఠాధిపతి పర్యటన

భీమవరం, నవంబర్ 22:- విశాఖపట్నంలోని రామకృష్ణా మఠాధిపతి స్వామి గౌతమానందాస్వామిగారు విశాఖజిల్లా, తూర్పుగోదావరి జిల్లా, ఈజిల్లా నర్సాపురం తాలూకాలలో తుపాను వల్ల ఎక్కువగా దెబ్బతిన్న గ్రామాలను చూచి ఈ ఉదయం ఇచ్చటకు వచ్చిరి. కొన్ని గ్రామాలలో పంట నష్టం ఏలా ఉన్నప్పటికి ప్రజల దుస్థితి భరించరానిదై యున్నదని, కనీసపు జీవనోపాయాలు, అనగా, బట్ట, తావు, ఏర్పరచవలెనంటే ఇప్పటి వరకూ తాము చూచిన ప్రదేశములలో కోటిరూపాయలకు తక్కువకాకుండా సొమ్ము కావలెనని, పుణ్యక్షేత్రమైన అంతర్వేదిలో తుపాను వచ్చి మూడు వారము లయినా త్రాగుటకు మంచినీళ్ళుకూడా లేవని స్వామిజీ అనిరి. స్వామిజీ ఈ తాలూకాలోని ముఖ్య గ్రామములు చూచి, ఏలూరువెళ్ళి ఆపిదప కృష్ణాజిల్లా వెళ్ళనున్నారు. అనంతరం రామకృష్ణామిషన్ వారు చేయగలిగిన సహాయమును అమలులో పెట్టెదరని చెప్పిరి. (స్వ. వి.)

## రాష్ట్రేతరాంధ్ర మహాసభ కృషి

బరంపురం, నవంబర్ 23: రాష్ట్రేతరాంధ్ర మహాసభాధ్యక్షుడు పి. ఎస్. నారాయణ, పర్లాంధ్ర ప్రదీపికా సంపాదకుడు నిడమర్తి లింగమూర్తి, డాక్టర్ మంత్రిప్రగడ నరసింహారావు, ఎ. ఎల్. ఎన్. శాస్త్రిగార్లు, రాష్ట్రేతరాంధ్ర మహాసభ తరఫున, ఆంధ్రదేశ తుపాను బాధితుల సహాయార్థం నిధులు వసూలు చేసే సంస్థకు పోషకులుగా వుండమని కోరడానికి పశ్చిమ బెంగాలు గవర్నరు డాక్టర్ కె. ఎన్. ఖట్జూ గార్ని 20 తేదీ ఉదయం కలకత్తాలో దర్శించారు. డాక్టరు ఖట్జూ గారు తుపాను బాధితుల సహాయార్థం జరిగే ప్రతి ప్రయత్నానికి తన సహాయం సానుభూతి సర్వదా ఉంటుందని పలికారు. అంతే కాకుండా ప్రభుత్వ భవనం అవరణను యీ ప్రయత్నం విషయంలో ఎందుకేనా అవసరము ఉంటే వాడుకొన వచ్చుని కూడా అన్నారు.

ఇందుకుగాను కలకత్తాలోని ప్రముఖులతో ఒక సంఘం ఏర్పాటు చేయడానికి పి. ఎస్. నారాయణ గారు ప్రయత్నాలు చేస్తున్నారు. సౌతిండియన్ ఎసోషియేషన్, మహారాష్ట్ర మండలి, భారత భోధనా మండలి, యిత్యాది సంస్థలు యీ ప్రయత్నాలలో ప్రముఖ పాత్ర వహించబోతున్నాయి. (స్వ. వి.)

### రాజోలు తాలూకాలో ఈ సొమ్ము పంపకం

రాజోలు, నవంబరు 22: ఈ తాలూకాలో యిండ్లు కూలిపోయిన నిరుపేదలకు పంచిపెట్టుటకుగాను ప్రభుత్వంవారు 70 వేల రూపాయలు మంజూరు చేసినట్లు తహశీల్దారు జి. మానసరావుగారు తెలిపిరి. నావలు, వలలు పోగొట్టుకున్న పల్లీలకు పంచిపెట్టుటకు 20 వేల రూపాయలు మంజూరు చేసినట్లుగాకూడా తెలిసినది. తహశీల్ దారుగారు సఖినేటిపల్లి, రామేశ్వరం గ్రామాలలో యిండ్లు పోగొట్టుకున్న నిరుపేదలకు ఒక్కొక్కరికి రు. 5/-లు పంచిపెట్టారు. సప్లయి ఆఫీసరు గుండాబత్తుల సత్యనారాయణగారు కూడా ఆదేవిధంగా గోగనమఠం గ్రామంలో రు 850/-లున్నూ, కేశనపల్లిలో రు 1220/-లున్ను పంచినారు. ఈ సహాయం తాత్కాలిక మయినదేననీ, మరికొంత సహాయం కూడా నిర్వాసులకు జరుగుతుందనీ అధికారుల భోగట్టావల్ల తెలుస్తున్నది.

## డాక్టర్ పట్టాభి ప్రశంస

(1-వ పేజి తరువాయి)

రాష్ట్రాల కివ్వకుండా కేంద్రమే నిర్వహించాలని ఆంగ్లోయిండియన్ ప్రతినిధి ఫ్రాంక్ ఆంతోనీగారు సూచించారు.

8 రోజుల పాటు నూతనరాజ్యాంగ తృతీయ ప్రతిపాదనపై జరిగినచర్చ నేడు రచనాసంఘాధ్యక్షుడు డా॥ అంబేద్కర్ జవాబివ్వటంతో పూర్తి అయినది.

ఆఖురరోజు చర్చను ఆంగ్లోఇండియన్ ప్రతినిధి ఫ్రాంక్ ఆంతోనీగారు ప్రారంభిస్తూ నూతనరాజ్యాంగం ఆశయాలనూ, వాస్తవికపరిస్థితులనూ ఎంతో అద్భుతంగా సమన్వయించినదని ప్రశంసించారు. ఆంగ్లోఇండియన్‌వర్గంపట్ల రాజ్యాంగంలో చూపబడినసహృదయతకు ఆయన కృతజ్ఞత నర్పించాడు. కేంద్రానికి విశేషాధికారాలివ్వబడిన వన్న విమర్శలను ప్రతిఘటిస్తూ ఈ మాత్రం అధికారాలైనా కేంద్రప్రభుత్వానికి ఇవ్వటం అవశ్యమేననీ, పోలీసు, ఆరోగ్యం, విద్యాశాఖలు రాష్ట్రాలకు పూర్తిగా వదిలేయటం శోచనీయమనీ అయన అన్నాడు. అవిధంగా అశాఖలను కేంద్రం పూర్తిగా వదిలివేయటంవల్ల లౌకిక ప్రభుత్వ సూత్రాలు భగ్నంచేయబడుతున్నవనీ, అల్పభాషావర్గాలకు అన్యాయం చేయబడుతున్నదనీ, దీనివల్ల దేశం ఛిన్నాభిన్నమై పోగలదనీ ఆయన హెచ్చరించాడు.

### డా॥ పట్టాభి ప్రసంగం

కాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ పట్టాభిసీతారామయ్యగారు ప్రసంగించటానికి లేచినప్పటికి సభ్యులు ఉత్సాహంతో కోలాహలం చేశారు. ఆయన ఈ క్రింది విధంగా ప్రసంగించారు:

"నూతన రాజ్యాంగాన్ని పెంపొందించటంలోనూ, నిర్మించటంలోనూ గాంధీజీనూ త్రొల్లో ప్రధానమైన వాటిని అందులో మనం చొప్పించ కలిగాము. రాజ్యాంగ నిర్మాణం నెమ్మదిగా జరిగినందున అనేక అవసర మార్పులను చేసే అవకాశం మనకు కలిగింది. కొందరు విమర్శకులు రాజ్యాంగం విప్లవాత్మకం కాదనీ, 1935 ఇండియా చట్టానికి దీనికీ భేదంలేదని అన్నారు. అది పూర్తిగా నిజం కాదు. మసాయిదాలు, విప్లవాలు పరస్పర సమ్మతాలు కావు. క్రమ పరిణామం ద్వారా స్వాతంత్ర్యం సాధించాము కనుక నూతన రాజ్యాంగ నిర్మాణంలో 1935 చట్టాన్ని అనుసరించాము.

రాజ్యాంగ నిర్మాణంలో జరిగిన అలప్యపు వ్యవధిలో 562 భిన్న సంస్థానాలు మిగిలిన ప్రాంతంతో కలపబడినవి. దానివల్ల దేశం ఏకం కావాలన్న గాంధీజీ ఆశయం సఫలమైనది. అస్పృశ్యతా నిర్మూలన, ప్రత్యేక నియోజక వర్గాల రద్దు కూడా దరాన్నేకం చేస్తూ గాంధీజీ ఆశయాల ననుసరించినవి.

1937 లో గాంధీజీ మూడు ముఖ్య సూత్రాలను సూచించారు. అవి ఖద్దరు, అస్పృశ్యతా నిర్మూలన, హిందూ ముస్లిం ఐక్యత. అస్పృశ్యత నూతన రాజ్యాంగంలో నిషేధించ బడినది. ఖద్దరు గృహ పరిశ్రమలలో అగ్రగణ్యంగా చేయబడైది. ప్రత్యేక నియోజక వర్గాల రద్దువల్ల హిందూ ముస్లిం ఐక్యత లభించినది. బ్రిటిష్ ఆశ్రిత రాజ్యంగా ఉన్న ఈ దేశాన్ని సహకార సమాఖ్యలో సభ్యత్వ స్థాయికి తీసుకుని పోగలిగాము.

ప్రాథమిక హక్కులకు బంధన్లో మా ఇంగ్లాండు ప్రాదివేయ బడినది, 1931 కరాచీ కాంగ్రెసు తరవాత ఇది జరిగింది. ప్రతి ప్రాథమిక హక్కు ఒక బాధ్యతతో కూడి ఉన్నది. ఆడిటర్ జనరల్ (ప్రభుత్వ జమాఖర్చు పరిశీలనోద్యోగి) సుప్రీంకోర్టు జడ్జీలు మొ॥ స్తరు స్వతంత్రులై ఉండాలి"

జగత్ నారాయణ్ లాల్ గారు రాజ్యాంగ సూత్రాలను ప్రశంసించారు. కాని లౌకిక ప్రభుత్వ నిర్మాణానికి ఆక్షేపించారు.

అనంతరం రాజ్యాంగ రచనా సంఘ సభ్యుడు టి. టి. కృష్ణమాచారి గారు ప్రసంగిస్తూ "మన ఫెడరల్ రాజ్యాంగంలో రాష్ట్రాలకు తగిన అధికారాలనిచ్చాము. కేంద్ర రాష్ట్రాల అధికారాలను, నిర్వహించటంలో చాల జాగ్రత్త వహించాము. ప్రభుత్వ స్థానంలో ఎవ్వరూ లేకుండా పాయే దురవస్థ రాకుండా రాజ్యాంగంలో జాగ్రత్త తీసుకోబడ్డది" అని వివరించారు.

అస్సాం రాష్ట్రం ఆర్థికంగా చిక్కుల్లో ఉన్నదని కృష్ణమాచారి గారు వెల్లడించారు. అధ్యక్షుని అధికారాలను గురించి ప్రస్తావిస్తూ అధ్యక్షుడు నియంత కాగలడని విమర్శించేవాళ్లు, అతడుప్రధాన మంత్రి సలహామీద తప్ప వ్యవహరించ కూడదన్న సంగతి మరచిపోయినారని ఆయన ప్రతివిమర్శ చేశారు. "ప్రాథమిక హక్కులను పరిమితపరచాలన్న అంశాన్ని విమర్శించినవారు పొరబడ్డారని నేను అనను కాని ఈ పరిమితులు నిర్ణయించేది వయోజన వోటింగ్ పద్ధతిమీద ఎన్నిక అయిన పార్లమెంటేననిమాత్రం జ్ఞాపకం చేస్తున్నాను" అని ఆయన అన్నాడు.

ప్రభుత్వం సొంత ఆస్తులను వశంచేసుకొన్నప్పుడు నిర్ణయించిన పరిహారాన్ని గురించి కోర్టుకెక్కే అవకాశం లేదంటే దీనికి కారణం సాధారణప్రజలకు ఉపయోగపడే ఆర్థికచర్యలను ప్రభుత్వం తీసుకున్నప్పుడు కోర్టు వ్యవహారాలు అడ్డురాకుండా చేయుటమేనని ఆయన అన్నాడు. గవర్నర్లమీద ఉన్న నిషేధాజ్ఞకే రాజప్రముఖులకూడా అదుపులో ఉంచగలవని ఆయన అన్నాడు.

దేశబంధుగుప్తా గారు మాట్లాడుతూ పత్రికా స్వాతంత్ర్యం కాపాడే ఏర్పాటు చేయాలన్నారు.

డా॥పి. సుబ్బరాయన్, మహావీర్ త్యాగి, సురేశ్ చంద్ర మజుందార్, రాజ్ బహదూర్, తాజ్ మహల్ హుసేన్‌గార్లు ప్రసంగించిన తరవాత డా॥అంబేద్కర్ నేటితో 9 రోజులు జరిగిన చర్చకు సమాధానమిచ్చాడు. (ఈ సమాధానం విడిగా ప్రకటింపబడినది.)

## పరిషత్సభ్యులకు సచ్చిదానందసిన్హా సందేశం

పాట్నా, నవంబరు 25: ఈదిగువ సందేశాన్ని రాజ్యాంగ పరిషత్సభ్యులకు అందచేయవలసిందిగా కోరుతూ, శ్రీ సచ్చిదానందసిన్హా, డా॥ రాజేంద్రప్రసాద్‌కు ఒక తంతి పంపారు.

"తొలి అధ్యక్షుడుగా 1946 లో రాజ్యాంగ పరిషత్కార్యక్రమము ప్రారంభించే మహద్భాగ్యం నాకు కలిగినప్పటికి, దీర్ఘ అనారోగ్య కారణంవల్ల, కేపటి ఆఖరి సమావేశానికి హాజరుకాలేకపోతిని. రాజ్యాంగరచనా కృషిని అత్యంతశ్రద్ధతో గమనించాను. ఈ కృషి లోపరహితముగా ఉన్నదనిగాని ఉండుటకు అవకాశమున్నదనిగాని అన్నివర్గాలకు సంతృప్తి నివ్వ గలిగినట్లున్నదనిగాని నేననుకోను. బహుసంఖ్యాక జాతులుగా, బహుళ భాషలు, భిన్న అభిరుచులుగల కోటానుకోట్ల భారత ప్రజలలో అందరికీ సంతృప్తి కలిగించడం కష్టమైనపని. అందుచేత కొన్ని సమస్యలు ఉండిపోయినందుకు ఆశ్చర్య పడవలసిన పని యేమీ లేదు. పరిషత్ వ్యవహారాలలో, దాదాపు అన్ని విషయాలపై సభ్యులు ఐకమత్యంతో వ్యవహరించడం నామటుకు నాకు అత్యద్భుతంగా కన్పిస్తున్నది. ఇందుకు ఎక్కువగా మీరు ప్రశంసార్హులు. మీ కృషిని సఫలంచేసి, ఈ ప్రాచీన భారత వర్షం, ప్రపంచరాజ్య శ్రేణిలో, తిరిగి తన పూర్వ ప్రాధాన్యం దుకొని, కేగియమానంగా విరాజిల్లేటు చేయవలసిందిగా, నేను భగవంతుని ప్రార్థిస్తున్నాను.

## భారత రిపబ్లిక్ రాజ్యాంగానికి పరిషత్ ఆమోదం

సభ్యుల్లో కొందరు వందేమాతరం అనీ, కొందరు భారత్ మాతకీ జై అనీ జయధ్వనులు చేశారు. అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ గారు అధికారముద్ర వేస్తుండగా సినిమా కెమేరాలు చిత్రాలను తీసినవి.

### తిరిగి పరిషత్సమావేశం: రిపబ్లిక్ అధ్యక్షుని ఎన్నిక

జనవరి 26-వ తేదికి ముందొక సమావేశాన్ని ఏర్పరిచే అధికారాన్ని అధ్యక్షునికి ఇస్తూ సత్యనారాయణ్ సిన్హా (భారతప్రభుత్వ పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి) ప్రతిపాదించిన ఒకతీర్మానాన్ని పరిషత్ ఆమోదించినది. ఆసమావేశంలో భారతరిపబ్లిక్ అధ్యక్షుడు ఎన్నుకోబడతాడు.

ఈ తీర్మానాన్ని ఆమోదించిన అనంతరం రాజేంద్రప్రసాద్‌గారు సభ్యులందరితోనూ కరస్పర్శ చేయాలని అఖిలషించగా సభ్యులంతా మేమ వరుసగా వేదికదగ్గరికివచ్చి కరచాలనం చేశారు. ముందు ప్రధాని నెహ్రూ, ఆ నక సర్దార్ పటేల్, ఆతరువాత డా॥ అంబేద్కర్, ఆయనవెంట మిగిలిన సభ్యులు వరుసవెళ్లి కరచాలనంచేశారు.

మొదటి షెడ్యూల్ (ఓ) భాగంలో చెప్పబడ్డ 9 సంస్థానాలూ- హైదరాబాద్‌తోసహా ఈ రాజ్యాంగాన్ని ఆమోదించ అంగీకరించినందుకు సభ్యులంతా సర్దార్ పటేలును-ఇక్కడ రాజేంద్రప్రసాదును అభినందించేముందు- అభినందించారు.

ఇదివరకు పరిషత్సభ్యుడుగా ఉండి ప్రస్తుతం అస్సాం గవర్నరుగానున్న శ్రీ ప్రకాశగారూ, మొట్టమొదట పరిషత్కార్యక్రమాన్ని ప్రారంభించినవాడూ సభ్యులందర్లోనూ వయోవృద్ధుడూ ఆయిన సచ్చిదానందసింహా గారూ పంపిన సందేశాలను రాజెన్‌బాబు చదివారు.

### జాతీయగీతం

'వందేమాతరం' గీతాన్ని జాతీయ గీతంగా నిర్ణయించే విషయమై బి. దాస్ (ఒరిస్సా) గారు ప్రశ్నిస్తూ ఆ విషయమై పరిషత్ అధ్యక్షుడు అధికార ప్రకటన ఏమయినా చేస్తారా అనీ, ఏది జాతీయగీతంగా నిర్ణయిస్తారు అనీ అడిగారు. అవసరమయితే ఆవుసస్య జనవరిలో పరిషత్ తిరిగీ సమావేశమైనప్పుడు చర్చించబడుతుందని రాజన్‌బాబు సమాధానమిచ్చారు.

రాజ్యాంగం సామాన్య ప్రజల భాష అయిన హిందీలో ఉండాలని అల్గూరామ్ శాస్త్రి (సం. రా.) వెల్లడించిన కోరికకు అధ్యక్షుడు సమాధానమిస్తూ మరొక 15 ఏళ్ళవరకూ ఇంగ్లీషే యూనియన్‌లో అధికార భాషగా ఉండాలనినిర్ణయించడమైనదని జ్ఞాపకం చేశాడు. హిందీ భాషలో రాజ్యాంగపు ప్రతి జనవరి 26వ తేదీనాటికి తయారు కావచ్చుననీ, రాజ్యాంగం మిగిలిన రాష్ట్రీయ భాషలలోకి కూడా అనువదించబడుతుందనీ ఆయన వెల్లడించాడు.

శ్రీమతి పూర్ణిమా బెనర్జీ "జనగణమన గీతం" పాడటంతో సమావేశం ముగిసింది.

### రాజెన్‌బాబు ప్రసంగం

32 కోట్ల ప్రజలకు రాజ్యాంగం నిర్మించటం వంటి మహత్తర కార్యాన్ని నిర్వహించి నందుకు పరిషత్తును అభినందిస్తూ రాజేంద్ర ప్రసాద్ గారీక్రింది విధంగా ప్రసంగించారు.

"రాజ్యాంగం సక్రమంగానె అవే శేట్లు చేయుటానికి వయోజన వోటింగును పట్టి ప్రధాన బాధ్యులైన మన గ్రామ ప్రజల వివేచనాశక్తిలో నాకు విశ్వాసమున్నది. కృత్రిమ నాగరికతను అలవరుచుకున్న వారు వాటిని ఆమోదించలేరేమో కాని గ్రామ ప్రజలకు దిట్టమైన ప్రపంచ జ్ఞానం, సంస్కృతిం ఉన్నది. వయోజన వోటింగు పద్ధతి కింద 16 కోట్ల మంది వోటు చేస్తారని నేను అంచనా వేస్తున్నాను. నూతన రాజ్యాంగం కింద మొట్టమొదటి ఎన్నికలు 1950-51కాలంలో జరగగలవు."

## హేగ్ ఒప్పందం

### ఇండొనీషియా రిపబ్లికన్ పార్టీల సుముఖత

బటేవియా, నవంబరు 24: ఇండొనీషియా రిపబ్లిక్, ఫెడరలిస్టు పార్లమెంటులురెండూ, హేగ్ రౌండ్ టేబుల్ ఒడంబడికను అధికారరీత్యా అంగీకరించవలసి వుంది.

రిపబ్లిక్‌లోని మూడు ప్రధాన రాజకీయ కక్షులవారిలో రెండుకక్షులవారు, ఇప్పటికే తమ ఆమోదాన్ని వెలిబుచ్చుతున్నారు. హట్టాప్రభుత్వంలో ఎక్కువ ప్రాతినిధ్యమున్న ముస్లిం మాషూమీ పక్షంవారూ, జాతీయ పక్షంవారు తమతమ కార్యవర్గాలలో యీ విషయాన్ని చర్చించి ఇలా ప్రకటించారు.

'ఒప్పందపు విషయాన్ని తేల్చటం మరోసంవత్సరం వాయిదాపడినా, ప్రజలు ఆమోదించదగిన అంశాలు కొన్ని యీ ఒడంబడికలో వున్నయ్.' అని ప్రకటించారు.

మూడవ ప్రధానపక్షంగా వున్న సోషలిస్టుపార్టీ నాయకుడు డాక్టరు షాహ్రీర్ (మాజీ ప్రధాని) యీ విషయమై ఇంతవరకూ యే అధికార ప్రకటనా చేయలేదు. ఇతర చిన్నచిన్న పార్టీలవారికి కొంత మతభేదమున్నా దానివల్ల వచ్చే పెద్ద యిబ్బంది యేమీవుండదు.

పత్రికలు కూడా మొదట చాలా ప్రతిఘటన చూపినా యిప్పుడు క్రమేపి సుముఖతనే ప్రదర్శించుచున్నవి.

ఉన్న పెద్ద ఇబ్బంది అల్లా ఏమిటంటే, ఈ రిపబ్లిక్ పార్లమెంటు సమావేశమై యిప్పటికి చాలారోజులైంది. వారినందర్నీ ఇప్పుడు సమావేశపరచుటనుంటే చాలా వ్యయప్రయాసలతో కూడినపని. ఇందుకు 12 లక్షల గిల్డర్ల సైకిలుకు వ్యయం చేయవలసివుంటుంది.

# "భారతరాజ్యాంగమే మధ్యభారత్ రాజ్యాంగం"

## రాజప్రముఖుని అధికార ప్రకటన

గ్వాలియర్, నవంబరు 24: రాజ్యాంగ పరిషత్తువారు అవలంబించిన భారత రాజ్యాంగ విధానమే మధ్యభారత్ రాజ్యాంగ విధానముగా నుండునని మధ్యభారత్ శాసనసభ ప్రత్యేక సమావేశములో రాజప్రముఖుడు ప్రకటించెను. భారతరాజ్యాంగ విధానము అమలులోనికి వచ్చిన నాటినుండియు దానియందలి పద్ధతులు ప్రస్తుతము సంస్థానమునందు అమలులోనున్న రాజ్యాంగ సంబంధమగు ఏర్పాటుల నన్నిటిని రద్దుచేయునని, సంస్థానమునందు యిప్పుడున్న ఏర్పాట్ల స్థానమును భారత రాజ్యాంగ విధానమునందలి పద్ధతులు ఆక్రమించునని ఆయన తన ప్రొక్లమేషనులో చెప్పెను.

రాజప్రముఖుని ప్రొక్లమేషనును ఆతని పక్షమున ప్రధాని చదివినప్పుడు సభాసదులు హర్షసూచకములగు నినాదములు గావించిరి.

రాజప్రముఖుని ప్రకటన యిట్లున్నది: "భారత రాజ్యాంగ పరిషత్తువారు యిప్పుడు యావద్భారత దేశమునకు ఒక రాజ్యాంగ విధానమును నిర్మించుచున్నారు. ఈ రాజ్యాంగ విధానము అమలులోనికి రాగానే 1935 సం॥పు భారత ప్రభుత్వ చట్టము, ప్రస్తుతము ఈ సంస్థానమునకును భారత అధినివేశమునకును మధ్యగల సంబంధములను నిర్వచించు భారత ప్రభుత్వ చట్టము రద్దగును. ఆర్థిక రాజకీయేత్యాది రంగములలో మధ్యభారత ప్రజల క్షేమలాభములకును, తక్కిన భారతదేశ ప్రజల క్షేమలాభములకును అవినాభావ సంబంధముండుటచేత ఈ రెండింటిమధ్య యేర్పడిన సంబంధములను ముందుగూడ సాగించుట మాత్రమే గాక వాని దృఢపరుచుటగూడ అవసరము. భారత రాజ్యాంగ పరిషత్తువారు ఈ సంస్థాన ప్రతినిధుల సలహాను, సహాయమును పైకొని అవలంబించిన భారత రాజ్యాంగ విధానము యిట్లు చేయుటకు తగిన ప్రాతిపదికగా నుండును." ఈ ప్రొక్లమేషను జరుగుటకు పూర్వము రాజప్రముఖుడు శాసనసభలో నుపన్యసించుచు స్వాతంత్ర్యసిద్ధ్యనంతరము మధ్యభారత్‌లో జరిగిన పరిణామములను వివరించిరి. సర్దార్ పటేలు దూరదృష్టి, బుద్ధికుశలతవల్లను, ఇతర నాయకులు, ప్రజలు సహకరించుటవల్లను, సంస్థానాధీశ్వరులు త్యాగనిరతితోను, దేశభక్తితోను వ్యవహరించుటవల్లను ఐదువందల సంస్థానములను ఏకముచేయ వీలయ్యెనని చెప్పెను.

# చెన్నరాష్ట్ర విభజన

## ఆస్తి, అప్పుల విభజనసంఘాలు: కాంగ్రెసు కార్యదర్శి వచ్చే సూచన

మదరాసు, నవంబరు 25: ఆంధ్ర రాష్ట్రం నిర్మించుటకు కేంద్రప్రభుత్వంవారు నిశ్చయించినందున, ప్రాతక్రొత్తరాష్ట్రాల ఆస్తిఅప్పుల పంపకం వ్యవహారాలు ఉభయుల ఒప్పందంమీద నిర్ణయించవలసియున్నదనియు, అందునిమిత్తం విభజన సంఘాలను నియమించవలసియున్నదనియు ఆవిషయమై త్వరలో కేంద్రప్రభుత్వంవారు మదరాసు ప్రభుత్వంవారికి సూచించెదరనియు, ఢిల్లీనుండి అధికారవర్గముల వారికి వచ్చిన ప్రయివేటు వార్తలవలన తెలియుచున్నది.

ఈ వ్యవహారములగూర్చి తగు యేర్పాటులు చేయ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారు త్వరలో మదరాసు రానున్నారని తెలియుచున్నది.

### పెండ్లి కట్నాల చట్టం

#### కాంగ్రెసుపార్టీ నిరాకరించుట

మదరాసు, నవంబరు 25: వివాహాల కట్నాల నిషేధించు చట్టము అసెంబ్లీలో ప్రతిపాదింప శ్రీ కె. విశ్వనాథంగారికి అసెంబ్లీ కాంగ్రెసుపార్టీవారు నిన్న సాయంకాలజరిగిన సభలో నిరాకరించిరి. ఈ బిల్లుగూర్చి రెండు గంటలసేపు చర్చజరిగెను. శ్రీమతి అమ్మన్నరాజాగారు మరి 13 గురు సభ్యులు చట్టమును బలపరచిరి. గనివల్ల ప్రయోజనముండదని మంత్రి మాధవమేననుగారనిరి 14 గురు సభ్యులు అనుకూలంగాను, 48 గురు ప్రతికూలంగా నుండిరి. 75 గురు సభ్యులు హాజరయ్యిరి.

### మదరాసు నీటిసప్లయి

మదరాసు నగరానికి నీటిసప్లయికి గాను, పరిశుభ్రమయిన నీరును యిచ్చుటకు, ఎక్కువగ యిచ్చుటకు వీలుగాను, ఎంతకాలం కంపులేకుండా చేయుటకును "మైక్రో స్ట్రెయినరు" అను యంత్రమును రూ 1 లక్ష యిచ్చి కొనుటకు ప్రభుత్వంవారు నిశ్చయించిరి. ప్రధాని కుమారస్వామిరాజాగారి అధ్యక్షతను మంత్రులు, మేయరు, ప్రభుత్వ కార్యదర్శులు ఇంజనీర్లు, ఎ. వి. రామను మున్నగువారందరు కలసి యీ నిర్ణయం చేసిరి. 12 నెలలలోగా యిది ఇంగ్లాండు నుండి తెప్పించెదరు. ఇట్టివి 10 కొనదలచిరి.

# నవభారత జాతీయ గీతం

## సార్వసంఘంలో చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 24: ఏ గీతమును భారత జాతీయగీతముగా నవలంబించవలెనను విషయమై రాజ్యాంగ పరిషత్ సార్వసంఘమువారు నేడు 1½ గంటసేపు చర్చించిరి. పరిషత్ అధ్యక్షులు డా॥ రాజేంద్ర ప్రసాద్‌గారు అగ్రాసనాధిపత్యము వహించిరి. ప్రధాని పండిత నెహ్రూ, ఉపప్రధాని సర్దార్ పటేలు మున్నగువారు సభలో పాల్గొనిరి. కొందరు సభ్యులు 'జనగణమన' గీతమునకు అనుకూల్యమును వెల్లడించిరి. మరికొందరు 'వందే మాతరం' గీతమునకు అనుకూల్యము వెల్లడించిరి. ఉభయ పక్షములబలం దాదాపు సమానముగా నుండుటచేత రెండుగీతములకును సమాన ప్రతిపత్తి యొసంగ వీలగునా? అను విషయమును యింకను పరిశీలింప సభవారు నిశ్చయించిరి. ఈనిర్ణయముపై ఆధారపడు ఒక తీర్మానమును జనవరి 25 తే సమావేశమున భారతరాజ్యాంగ పరిషత్తులో ప్రతిపాదింతురని అనుకొనుచున్నారు.

# శాంతినికేతనంలో ప్రపంచశాంతిసభ

శాంతినికేతనం, నవంబరు 25: డిసెంబరు 1 తేదీని రవీంద్రనాథఠాకూరుగారిచే స్థాపింపబడిన శాంతినికేతనమునందు అఖిల ప్రపంచ శాంతికాముల మహాసభ సమావేశమగును. 32 రాజ్యాలనుండి 75 మంది ప్రతినిధులు సమావేశము కానున్నారు. డా॥ రాజేంద్రప్రసాదుగారు అధ్యక్షత వహించెదరు. బుద్ధుడు గాంధి అవతరించిన భారతదేశములోనే శాంతికాముల మహాసభ జరుగుట యుక్తముగానున్నది. పశుబలమును పశుబలముచే ఢీకొనుటకు వీలులేదు. సహాయ నిరాకరణోద్యమమువల్లనే పశుబలము నెదుర్కొనవలెను. అని ప్రొఫెసర్ అల్బర్టు యూన్‌స్టీను పండితుడు వ్రాసెను. గాంధీజీ బోధించిన ధర్మసూత్రములు ప్రపంచములోని మానవులు గ్రహించి అనుసరించుటకు తగిన తరుణమింకను దాటిపోలేదని యూన్‌స్టీను పండితుడు చెప్పెను.

ఈశాంతి మహాసభ జరుపుటకు 1945 సం.లోనే సంకల్పింపబడెను. కాని భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చినపిమ్మట యీసభ భారతదేశములో జరుపుట యుక్తమని గాంధీజీ చెప్పెను. అప్పుడు భారతదేశములో ఉన్న శాంతి కేవలము తుపాకుల మొనలను బారుచేసి ప్రజలను ప్రశాంతంగా బ్రిటిష్‌వారు ఉంచుచున్నారు. కనక ఇది నిజమైన దేశశాంతి కాదు. ఈప్రపంచశాంతి సభను జరుపుటకై రసూలియాలోను సేవాగ్రామములోను రెండు సమాలోచనసభలు జరుపబడెను. మొదటిది 1948 సం॥ జనవరి మాసంలోను, రెండవది యీ సంవత్సరం జనవరిలోను జరుపబడెను. రెండవసభకు ఆయిరోపా నుండియు, అమెరికానుండియు ప్రతినిధులు విచ్చేసిరి. సత్యము అహింసయను రెండు ధర్మములను అనుసరించి నూత్న ప్రపంచ వ్యవస్థనొకటి ఏర్పాటు చేయవలెనని సంకల్పింపబడెను. ప్యారిసునగరంలో పశ్చిమ ఆయిరోపా రాజ్యాలవారొక శాంతిసభను జరుపుచున్నారు. ప్రేగ్ నగరంలో రష్యా పక్షం చేరిన తూర్పు ఆయిరోపా రాజ్యాలవారొక శాంతిసభను జరుపుచున్నారు. కాని యీ శాంతి సభలకును శాంతినికేతన సమావేశమునకును పోలికయే లేదు.

ఈ శాంతికాముల సభను సమావేశపరచుట కొక కమిటీ ఏర్పాటు చేయబడెను. ఈ సమావేశ కమిటీ చెయిర్మనుగ హోరేస్ అలెగ్జాండరు గారు వ్యవహరించుచున్నారు. యీ సభకు శాస్త్రవేత్తలు, వేదాంతులు, విద్యాభోధకులు, పత్రికా సంపాదకులు, వ్యాపారస్థులు, శిల్పులు, కర్మకారులుకూడా వచ్చుచున్నారు.

మత నిర్బంధవిరహితమైన వ్యాపారములని విధిగాం శక్తులను సత్యము అహింస యనెడి ధర్మసూత్రములను ఏకరీతిగా వర్తింపజేయ సాధ్యమగునో యీసభలో చర్చింపబడును. చిన్నజాతులు, పెద్దజాతులు పరస్పరసహకారముతో పని చేయుటను గూర్చియూ, అఖిల ప్రపంచ సమాఖ్య ప్రభుత్వమనెడి విషయమును గూర్చి యూ ప్రపంచశాంతి భావమును ప్రచారముచేయు యాజమాన్యమైన విద్యావిధానమును గూర్చియూ యీ సభలో చర్చింపబడును.

# తుపాను నష్టం 28 కోట్లు

## ఇంతవరకు ప్రభుత్వం రూ 19,66,000 మంజూరు చేసింది

మదరాసు, నవంబరు 25: ఆంధ్రదేశంలో తుపానుబాధితుల సహాయానికి మదరాసు ప్రభుత్వంవారు యింతవరకు రూ 19,66,000 ఖర్చు మంజూరు చేసిరని, రివెన్యూ మంత్రి సీతారామారెడ్డి గారు మా ప్రతినిధికి తెలిపి ప్రభుత్వం అంచనాల ప్రకారము మొత్తం నష్టం 28 కోట్లుండును. ప్రభుత్వం వారు మంజూరు చేసిన మొత్తాలు జిల్లా వారిగా యిట్లున్నవి.

విశాఖ జిల్లా రూ 75000, తూ. గోదావరి 3½ లక్షలు ప. గోదావరి - 5,26000 కృష్ణ - 5,60,000 గుంటూరు - 2,50,000 నెల్లూరు 50,000 కర్నూలు 1 లక్ష, కడప 50,000 బళ్ళారి 50,000.

ప్రత్యేకం కొబ్బరి, తోటలకు మాత్రం 18 కోట్లు నష్టం కలిగెను.

రివెన్యూ మంత్రిగారు రేపు రాత్రి బయలుదేరి ఆప్రాంతాలను స్వయంగా చూడబోవుచున్నారు.

### తుపాను నిధి

#### రాష్ట్రీయ శ్రేయనిధికి వచ్చిన చందాలు

రూ 50 లకు మించి చందా లిచ్చినవారందరి పేర్లను మదరాసు రాష్ట్రశ్రేయనిధి అధ్యక్షులు యిట్లు ప్రకటించుచున్నారు: గవర్నరు జనరలు 1000, ప్రధాని నెహ్రూ 25,000, మదరాసు గవర్నరు 5000, అస్సాం గవర్నరు 200, సర్ ఆర్చిబాల్డు నై 500, ప్యారీకంపెనీ 10,000, హిందూపత్రిక యజమానులు 5000, ఎస్. ఎస్. వాసను (జమిని) 5000 శ్రీ నరోత్తం దాసులిల్లి 251, గోర్డనువుడ్రాఫ్ 250, బి. అండ్ సి. మిల్లు 250, అభ్యాసికులు (డెరాడూను) 202, మెట్రోపాలిటను సైకిలుకంపెనీ 101, లాలుచంద్ దాదా 101, బి. బ. కె. సుందరంచెట్టి 100, సి. గోవిందస్వామి 100, మిద్వేజీ దేవుచందు 100, కె. సంజీవిచెట్టి 100, అమ్ముస్వామి నాథను 50, విజయస్వామి నాథను 50, క్లబువాలా సతి 50, డా॥ ఎస్. చంద్రశేఖరన్ 50, రూ 50 లోపువారు 104.

మదరాసు రోటరీక్లబువారు రు 2000 తుపానుబాధితుల సహాయానికి గాను గుంటూరులోని డా॥ పి. హెచ్. విటలరావు గారికి పంపిరి. వస్త్రములుకూడ వసూలు చేసి పంపదలచిరి.

# స్టర్లింగ్ రాజ్యాలు విడిపోయే ప్రమాదం

## ద్రవ్యమారక వ్యత్యాసాలు: కన్సర్వేటివ్ సభ్యుని హెచ్చరిక

లండన్, నవంబర్ 24: స్టర్లింగ్ ప్రాంతంలోని ఆయా దేశాల, ద్రవ్యమారకం విలువల మధ్య తారతమ్యం మరింత ఎక్కువవడంవల్ల స్థితి, కొన్ని రాజ్యాలు స్టర్లింగ్ ప్రాంతంనుంచి పైదొలగే ప్రమాదం సంభవించవచ్చునని, పార్లమెంటులోని కన్సర్వేటివ్ సభ్యుడు వాల్టర్ ఫ్లైజర్ హెచ్చరించాడు.

ఇప్పుడు ఆయా దేశాల ద్రవ్యమారకపు విలువల తేడా కొంత సహేతుకముగనే ఉన్నప్పటికీ, క్రమేణా మిగతా రాజ్యాలు గూడా, ఆర్థిక విధానంలో పాకిస్థాన్ అనుసరించిన స్వతంత్ర పంథానే తొక్కవచ్చు. స్టర్లింగ్ ప్రాంతంలోని మిగతా దేశాలతో పాటు తన ద్రవ్య మారకపు విలువను మార్చకుండా అట్టె పెట్టిన దేశం ఒక్క పాకిస్థానే"

తన కరెన్సీకి వినిమయ దేశాల కరెన్సీలలోకి మార్చే వీలు కల్పించే మొదటి స్టర్లింగ్ ప్రాంత దేశం, పాకిస్థానే కావచ్చు. పోతే మలయా విషయం గూడా ఒకకంట కనిపెడుతూ ఉండాలి. మలయాకు డాలర్ల ఆర్జన ఎక్కువ. తను స్వతంత్ర దేశం కాకపోబట్టి, యీ డాలర్లను, తన ఉపయోగానికి వినియోగించబడటం లేదని మలయా వాదించవచ్చు.

ఆఫ్రికా ఖండంలో ఉన్న స్టర్లింగ్ దేశాలు, పశ్చిమ ఇండియా దీవులలో గూడా యీ రకమైనధోరణే కన్పిస్తున్నది." అని ఫ్లైజర్ హెచ్చరించాడు.

### భారత ప్రభుత్వ వ్యయ కర్తనం

న్యూఢిల్లీ, నవంబరు 24: ఆయా ప్రభుత్వ శాఖల వ్యయకర్తన ప్రణాళికలలో బోనసులు అన్ని ప్రభుత్వ శాఖలవారికి ఇస్తారని తెలుస్తున్నది. జనపనార పరిశ్రమలో ఒక ప్రణాళిక ఇంతకు పూర్వమే అమలులోకి వచ్చి ఉండడంవల్ల దానికి బోనసులు వర్తించదని తెలుస్తున్నది.

వ్యయకర్తనం చేసే పరిశ్రమలవారు ఈ విషయంలో ఏర్పాటు చేయబడిన ఒక ప్రత్యేక సంఘం తీర్పు ప్రకారం కార్మికులకు బోనసు ఇవ్వబడగలదని కూడా తెలుస్తున్నది. ఈ విషయంలో అంత్య నిర్ణయాలు ఒకవారంలో తెలుస్తాయి.

### అరవింద దర్శనం

పుదుచ్చేరి, నవంబరు 24: నేడు శ్రీ అరవిందులు ఆశ్రమములో నివసించుచున్న 700 మందికిని, వెలుపలనుంచి వచ్చిన దాదాపు వేయి మందికిని దర్శనమొసంగిరి. భక్తులు మాత, అరవిందుల ప్రక్కగా మౌనముగా వారొసంగిన ఆశీర్వాదములను పైకొనుచు ఒకరివెనుక నొకరు నడిచిపెళ్లిరి. ప్రభాతసమయమున పుదుచ్చేరీప్రజలు మాత, అరవిందుల పటములతో, సంగీత వాద్యములతో ఊరేగింపు చేసిరి. ఈ ఊరేగింపు ఆశ్రమము వద్దకు చేరగానే మాత మేడ వసారాలో నిలిచివచ్చి ఆశీర్వదించెను.

భవిష్యత్తున ఆధ్యాత్మిక తేజను ఉజ్వలముగా ప్రకాశించుననీ, ఆధ్యాత్మిక సూర్యోదయము గునని 1926 సం॥ నవంబరు 24 న శ్రీ అరవిందుల కొక దివ్యదర్శనము కలిగెను. దీనిని సాధించుటకు శ్రీ అరవిందులకు శక్తి కూడా కలిగెను. నేడు ఈ దర్శనముయొక్క 24 వ వార్షికోత్సవ మనుటచేత ఈ ఉత్సవము లిచ్చట జరిగెను. అరవిందుల గ్రంథములు, శిశిరకుమార మైత్రాగారి రెండు గ్రంథములు నేడు ప్రకటితమయ్యెను.

నేడు అరవిందుని దర్శనము చేసికొన్నవారిలో హైద్రాబాదు సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు. స్వామి రామానంద తీర్థ, పిఠాపురం యువరాజు, న్యూయార్కునుండి వచ్చిన పి డ్రీ రాసలెర్, శ్రీ వి. ఎస్. శాలాగారలు కలరు.

### నేపాల్‌తో ఇండియా ప్రభుత్వ ఒడంబడిక

ఢిల్లీ, నవంబరు 24: నేపాలు ప్రభుత్వపు విదేశాంగ వ్యవహార డైరెక్టరు జనరలు మేజరు జనరలు విజయాగారు బొంబాయికి పోవుచు నేడు ఢిల్లీలో దిగిరి. ఇండియా ప్రభుత్వపు విదేశాంగ కార్యాలయాధికారులతో సంభాషణలు జరిపిరి. ఇండియా గవర్నమెంటుతో నేపాలుప్రభుత్వం వ్రాసికోవలసిన మైత్రి పత్రమును గూర్చి యీ సంభాషణలు జరిగెను. వెనుక వ్రాసికోబడిన అనేక పత్రములకు బదులుగా వాటిస్థానే ఒక పత్రము వ్రాసికోవలెనని ఇండియా ప్రభుత్వపు కోరికగాయున్నది.

### పరిషత్ కాంగ్రెస్‌పార్టీ సమావేశం

న్యూఢిల్లీ, నవంబర్ 24: రాజ్యాంగ పరిషత్తులోని కాంగ్రెస్ పార్టీ సమావేశం 28 తే. సోమవారంనాడు జరుగుతుంది.

### ఠక్కర్ బాబా 80 వ జన్మదినోత్సవం

న్యూఢిల్లీ, నవంబరు 25: ఏ. వి. ఠక్కర్ బాబా 80 వ జన్మదినోత్సవం నవంబరు 29 వ తేదీన జరుగుతుంది. ఆ రోజున ఇక్కడ జరిగే బహిరంగ సభకు సర్దార్ పటేల్ అధ్యక్షత వహిస్తారు. ఠక్కర్ బాబా సేవను ప్రశంసిస్తూ ఒక అభినందన గ్రంథాన్ని తయారు చేస్తున్నారు.

### శ్రీనగర్‌కు స్విస్ సైన్యోద్యోగి రాక

శ్రీనగర్, నవంబరు 24: స్విస్ సైన్య డిప్యూటీ సర్వాధికారి కర్నల్ డి. ఆర్. శారల్ బ్రూనర్ యీ వుదయం శ్రీనగర్ వచ్చారు. మేజర్ జనరల్ తిమ్మయ్యగారు ఆయనకు స్వాగతం చెప్పారు. యుద్ధవిరమణ ప్రాంతంలోని అగ్రస్థానాలను పరిశీలించి ముందుముందు యుద్ధవిరమణ స్థావరాల స్థాపనకు ...

# రాష్ట్రంలో చక్కెర సప్లయి లోటు

## వెంకటగిరిలో హోటళ్ళవారి సమ్మె

వెంకటగిరి, నవంబరు 24: ఇక్కడ, బంగారు పేటలోను గల హోటళ్లు, స్వీటు దుకాణముల యజమాను లందరు నేటినుంచి దుకాణంమూసివేసి సమ్మె ప్రారంభించినారు. హోటలు యజమానుల సంఘాధ్యక్షుడు సి. రామయ్యనాయుడుగారిని విచారించగా స్థానిక డిప్యూటీ తహసీల్దారులుగారు తమకు చక్కెర యివ్వనందుననే తామిందుకు పూనుకొనిరని. సంఘం తరపున పై అధికారులకు టెలిగ్రాములు, అర్జీలు పంపుకొనిరని కూడ తెలిపిరి. (స్వ. వి.)

### నగరిలో చక్కెర పంపకం

నగరి, నవంబరు 24: నేటి నుంచి యిచ్చట చక్కెర వారానికి ఒక యూనిట్టుకు ఒకపలం లెక్కను రేషన్‌కార్డుల మీద పంచి పెట్టుతున్నారు. (స్వ. వి.)

### మంగళగిరిలో చక్కెర ఇబ్బంది

పంచదార కోటా ఏర్పాటుగాని పంచదార తెప్పించి ప్రజలకు పంచు ఏర్పాటుగాని యింతవరకు జరుగలేదు. ప్రజాసామాన్యమునకు అత్యవసర పరిస్థితులకు గూడా దొరుకుటలేదు. చాటుమాటుగా వీశ రు. 4-0-0 లకు కొంతమందికి దొరుకు చున్నట్లు చెప్పుచున్నారు. (స్వ. వి.)

### పంచదార సప్లయి

చెన్నపట్నం, నవంబరు 25: సలాంగారి ప్రశ్నకు అసెంబ్లీలో సమాధానంగా చెన్నపట్నంలో పంచదారకు రేషనింగ్ పెట్టెరనియు, జిల్లాలో టోకువర్తకులకు, కొందరు చిల్లర వర్తకులకు పంపకముచేయు ఏర్పాటు చేసినారనియూ ఆహారమంత్రి తెలిపిరి.

శ్రీగిరి మెర్స్ కుమారస్వామి:-బియ్యం కార్డు ఉన్నవారందరికీ పంచదార ఇస్తారనుకోవచ్చునా!

స:-ఇదిఇన్స్పెక్టర్ రేషనింగుమాత్రమే.

శ్రీ తెన్నేటి విశ్వనాథం గారు:-పంచదారకరువు, తీరేవరకు హోటళ్ళలో మిఠాయి పదార్థాలు తగ్గించవలెనని ఉత్తర్వు చేసెదరా?

స:-ఆలోచించెదను.

అన్వరుగారు: వీశ దొండమూర్కెటులో 4-12-0 నుంచి 5-2-0 వరకు అమ్ముతోందని తెలియునా?

స:-తెలియదు.

శ్రీ రుజీద్: బెల్లంధర, పంచదార కంట్రోలుధరకన్న హెచ్చు అమ్ముచున్నది.

స:- పంచదార సప్లయి తగ్గినందున బెల్లం ధర పెరిగింది.

### మంత్రి శ్రీగోపాలరెడ్డిగారి పర్యటన

ఆర్థికమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు యీ నెల 29 తేది రాత్రి సెంట్రల్ నుండి బయలుదేరి మలబారులో పర్యటించి డిశంబరు 6 వ తేది ఉదయం చెన్నపురికి తిరిగి వచ్చెదరు.

### వెంకటరమణ తెలుగు పాఠశాల పెరంబూరు

పెరంబూరులో పై పాఠశాల యందు 26 వ తేది సా. 3 గం. తలిదండ్రుల సమావేశము గా॥ శ్రీ కల్లూరి చంద్రమౌళిగారి అధ్యక్షతను జరుగును. ఉపన్యాసములు, పిల్లల ప్రదర్శనము, బహుమతులు పంచుట జరుగును.

### ఆత్మహత్య

హరికృష్ణను (18) గంగిరెడ్డివీథి నివాసి విషం తాగినందున నిన్న రాత్రి ఆస్పత్రిలో చనిపోయెను.

### ఇద్దరు కమ్యూనిస్టుల అరెస్టు

మంగళగిరి, నవంబరు 24: పూరె సుబ్బారావు, సి. సుబ్బారావు అను కమ్యూనిస్టులు గుంటూరుపోవుటకు రయిలువద్ద వుండగా స్థానిక పోలీసువారు అరెస్టు చేసిరి. (స్వ. వి.)

### విడుదల

పై. స్వామిరెడ్డిగారు, కర్నూలుజిల్లా కమ్యూనిస్టు నిర్బంధితుని మదరాసు ప్రభుత్వంవారు విడుదల చేసిరి.

### రైల్వే ఉద్యోగుల పొదుపు నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబర్ 25: 250 రూపాయలకు పైన జీతం తెచ్చుకునే రైల్వే కార్మికులందరు తప్పకుండా నిర్బంధంగా పొదుపు విధానం అవలంబించాలని ఆలిండియా రైల్వే కార్మికుల ఫెడరేషను ఈ వేళ నిర్ణయించింది.

రవాణామంత్రి గోపాలస్వామిఅయ్యంగారు చేసిన సూచన ననుసరించి ఫెడరేషను ఈ విధంగా నిర్ణయించిందని తెలుస్తున్నది.

# యథాతథపు ఒడంబడికపై నైజాం సంతకం చేయలేదా?

## సంస్థాన రాజకీయవర్గాల అనుమానం

హైదరాబాద్, నవంబరు 25:— నిజాం నవాబు హైదరాబాదు ప్రవేశపత్రంపై సంతకంచేశారా, లేదా అని రాజకీయ వర్గాలవారు అనుమానిస్తున్నట్లు హైదరాబాదునుంచి 'ఆంధ్రపత్రిక' విలేఖరి వ్రాస్తున్నాడు. నతరాత్రి సంతకమును గూర్చి అధికారప్రకటన ఏమీ జరగలేదట. నిజాం జారీ చేసిన ఫర్మానాలో కూడా "భారత యూనియన్‌లో హైదరాబాద్ తాత్కాలిక ప్రవేశం" అని తప్పితే, సంతకంమాట ఎక్కడాలేదు. ఈవిషయమైవిచారించగా, ఆగస్టు 15 తరువాత చాలయంది సంస్థానాధీశులు సంతకంపెట్టిన ప్రవేశపత్రానికి కాలదోషం పట్టినట్లేననీ, కానియీ నిజాం ప్రస్తుతం సంతకంపెట్టవలసిన అవసరంలేదనీ తెలుస్తున్నది. భారత రాజ్యాంగమును అంగీకరించినంత మాత్రంలోనే ప్రవేశమునుగూడా అంగీకరించి నట్లవుతుందని కొందరు చెబుతున్నారు. దీనికి సమర్థనగా, నిన్న నే భారతరాజ్యాంగమును అంగీకరిస్తూ మధ్యభారత్ రాజప్రముఖ్ చేసిన ప్రకటనను వారు ఉదహరిస్తున్నారు.

### స్వామిరామానంద తీర్థ హర్షం

మద్రాసు, నవంబరు 25: భారతయూనియన్‌లో చేరుతూ, భారత రాజ్యాంగాన్ని అంగీకరిస్తూ నిజాం నవాబు చేసిన నిర్ణయాన్ని సంస్థానకాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానందతీర్థ నేడిక్కడ చాలా సముచితమని హర్షించారు. నేడు స్వామీజీ పుదుచ్చేరినుండి ఇక్కడకు వచ్చారు.

నిజాంఫర్మానాలో ఉన్నదైశ్వర్యకరం, తలవని తలంపుఅయిన విషయము ఏమీ లేదనీ, అది సహజంగా జరగవలసిన విషయమని అంతా ఎరుగుదురనీ ఆయన అన్నారు. హైద్రాబాదు ప్రవేశంపై నిజాం తాత్కాలిక ధ్రువం చెయ్యటం కూడా సముచితంగా ఉందని ఆయన అన్నారు.

ఇండియాలో హైదరాబాదు చేరటం ఎప్పుడో జరిగిపోయిందనీ ఇప్పుడు దానికి కేవలం అధికార ముద్రవెయ్యటమే జరిగిందనీ స్వామీజీ అన్నారు.

"హైదరాబాదు భవిష్యత్తును, నిజాం భవిష్యత్తును నిర్ణయించేది ప్రజలేనని భారత ప్రభుత్వం స్పష్టీకరించింది. ఈ నిర్ణయం చెయ్యటంలో హైదరాబాదు ప్రజలు గొప్ప రాజనీతిజ్ఞతను ప్రదర్శించవలసి వుంటుంది. ఈ సమస్యను, భాషా ప్రయుక్తరాష్ట్ర పునర్విభజనకు చాల దగ్గరసంబంధమున్నది. అందుచేత దీనిని అఖిలభారత పరిస్థితి దృష్ట్యా ఆలోచించవలసి వుంటుంది." అన్నారు స్వామీజీ.

ఫర్మానాలో పేర్కొనబడిన 'వారసులు' అనే మాటపై వ్యాఖ్యానిస్తూ, అది ఏదో ఆచార లాంఛనంగా అన్నమాటేగాని, దానిలో ప్రత్యేకార్థమేమీ లేదనీ, అసలు ఇప్పటి మహారాజాల, నవాబుల పరిస్థితే అనుమానంగా ఉన్నప్పుడు ముందు రాబోయే వారసులమాట మరి అప్రస్తుతంగావుంటుందనీ స్వామీజీ అన్నారు.

# "డచ్-ఇండొనీషియన్ సమితి రిపబ్లిక్ అధికారాన్ని మించదు"

## ప్రధాని డా॥ హట్టా విస్పష్టప్రకటన

బటేవియా, నవంబర్ 25: "హేగ్ ఒప్పందంలో ప్రతిపాదించబడిన, డచ్చి - ఇండొనీషియన్ యూనియన్ ఇండొనీషియన్ రిపబ్లిక్‌కు మించిన ఉన్నత వ్యవస్థ కాదు. ఉభయదేశాలూ స్వేచ్ఛగా సమానస్థాయిలో ఏర్పరచుకున్న సహకార సమాఖ్యమాత్రమే అది. ఏ విషయంలోనైనా తుది నిర్ణయాధికారం రెండుదేశాల పార్లమెంటులకే ఉంటుంది" అని ఇండొనీషియా రిపబ్లిక్ ప్రధాని డా॥ హట్టా తాత్కాలిక రిపబ్లికన్ పార్లమెంట్ కార్యవర్గ సమావేశంలో నేడు వివరించాడు. ఈ సభ జోగ్జకర్తాలో జరిగింది.

న్యూగినీ సమస్య సంయుక్త ఇండొనీషియా సర్వతంత్ర స్వాతంత్ర్య ప్రతిపత్తికి ఏవిధంగానూ హానికరం కాదని ఆయన అన్నాడు.

హేగ్ ఒప్పందాన్ని డిసెంబరు 5 వ తేదీన ఆమోదించవలసినదని తాత్కాలిక పార్లమెంటు కోరబడినదని రిపబ్లికన్ వర్గాలు వెల్లడించారు.

#### అధికార స్వీకారానికి సన్నాహాలు

డా॥ హట్టా హేగ్‌నుండి వచ్చి, డచ్చివారివద్దనుంచి అధికారాన్ని ఇండొనీషియా తరఫున స్వీకరించే సంఘాన్ని ఫెడరలిస్టు ప్రతినిధులతో కలిసి నిర్మించటానికి ప్రయత్నిస్తాడు.

ఆయన ఈ వేళ జోగ్జకర్తా రేడియోలో ప్రసంగిస్తూ రిపబ్లిక్ ప్రస్తుతం ఉన్నంత అంతర్జాతీయ ప్రతిష్ఠ ఇంతకుముందున్నది లేదనీ, ఏ విధమైన పరిస్థితులూ ... సర్వతంత్ర స్వాతంత్ర్యం పొందినట్లు డిసెంబర్ 30 వ తేదీ లోగా ప్రకటించబడుతుందని వెల్లడించాడు.

### ఇండొనీషియాలో ఆయా ప్రదేశాలకు సభ్యత్వనిర్ణయం

బటేవియా, నవంబరు 24: ఇండొనీషియాలో ఏర్పడిన ఆయా భాగాల సలహా సంఘం ఈ వేళ ఇండొనీషియా సంయుక్త శాసనసభలో ఏయేభాగానికి ఎన్నెన్ని స్థానాలుండాలో నిర్ణయించింది. ఆయా భాగాల ఎన్నికలు డిసెంబరు 15 వ తేదీని జరగగలవట. వచ్చే పార్లమెంటులో 50 స్థానాలు జోగ్జకర్తా రిపబ్లిక్‌కు ఉంటాయనీ మిగిలిన స్థానాలు సంయుక్త ఇండొనీషియాలోని మిగిలిన భాగాలకు ప్రత్యేకింపబడతాయనీ తెలుస్తున్నది.

# నానాటికీ సింహళ భారతీయుల అధ్వాన్న పరిస్థితి

## నెహ్రూ చర్చలు జరపాలని మద్రాసు ప్రభుత్వ తీర్మానం: అసెంబ్లీ ఆమోదం

చెన్నపట్నం, నవంబరు 25: సింహళ భారతీయులస్థితి సర్వరంగములందును నానాటికి తీసికట్టు అగుచున్నందున, భారతీయుల హక్కులకూర్చి భారత ప్రధాని సింహళయాత్ర సందర్భమున చర్చించవలెననియు, అవసరమైనచో మదరాసు ప్రభుత్వ ప్రతినిధులకూడ అక్కడ హాజరుపరుప అనుమతించవలెననియు మదరాసు అసెంబ్లీవారు కోరుచున్నారను తీర్మానమును మద్రాసు ప్రభుత్వ ప్రచార మంత్రి భక్తవత్సలంగారు ప్రతిపాదించిరి. భారతప్రధాని రాయబారానికి పూర్వం వారివద్దకు రాయబారం వెళ్లవలెనని కోసల్రాం, స్వామినాథన్‌గారలు సవరణలు తెచ్చిరి. హమీద్‌ఖాన్‌గారు సింహళం దక్షిణాఫ్రికాను అనుకరించుచున్నదనిరి. హమీద్‌ఖాన్, రాజా రాం నాయుడు, మజీద్, తెన్నేటి విశ్వనాథం, స్వామి సహజానంద, శ్రీ కామేశ్వరరావు, అణ్ణామలపిళ్ల, యల్. యన్. గోపాలస్వామి, కన్నియప్పన్, అన్వర్ గార్లు సింహళము భారతదేశ సంబంధములు బాగుపరుచుటకు అవసరచర్యలు తీసుకొనవలెనని ప్రసంగించిరి.

అంతటితో సభ మధ్యాహ్నము వరకు వాయిదా వేయబడెను.

### ఫలహారానంతరం

ఫలహారానంతరం అసెంబ్లీ సమావేశమైనపుడు సింహళ భారతీయుల సమస్యనూర్చి చర్చ సాగినది. భారతదేశానికి సింహళానికి ఆదినుండి తల్లి బిడ్డ సంబంధము ఉంటూ వచ్చినదనియు, ఉభయదేశాల సంబంధాలు బాగుపడుట పరస్పర సుహృద్భావము వల్లనే జరుగవలెను గాని ఉభయదేశాల మధ్య స్పర్ధను ప్రబలింప చేయుటవల్ల జరిగేది కాదని చిన్నకాజియార్ నుడివిరి.

శ్రీ డి. వి. రామస్వామిగారు సింహళ భారతీయుల హక్కులను కాపాడుటకు ఇండియా ప్రభుత్వము తగు చర్య తీసుకొనవలసినదిగా భారత ప్రధానికి విన్నవించి సహృద్భావము ద్వారా యీపని సాధించుకొనవలెనని కోరిరి.

శ్రీ బి. యస్. మూర్తిగారు మదరాసు ప్రభుత్వము సింహళ భారతీయుల విషయమై యీ విసమైన తీర్మానము చేయుటలో తృప్తిపడరాదనియు, భారతీయుల హక్కులను కాపాడుటకు ఇండియా ప్రభుత్వము తగిన చర్య తీసుకొనునట్లు చేయవలెననిరి. రజాఖాన్, హుసేన్, జమాలీ గార్లు తీర్మానము బలపరుస్తూ సింహళ భారతీయుల హక్కులకు సింహళ ప్రభుత్వము తగు రక్షణలొసగే విషయంలో మనము చర్య తీసుకొనునపుడు ఆ ప్రభుత్వమును రెచ్చగొట్టుట వల్ల ప్రయోజనం లేదని, వారి సానుభూతి ద్వారానే యీ కార్యము సాధించవలసి యున్నదనిరి.

శ్రీ డి. యస్. రామచంద్రరావుగారు మహాత్మాగాంధీ సాత్వికమైన మార్గంలో భారతదేశానికి యే విధముగా స్వాతంత్ర్యమును సిద్ధింప చేయగల్గినాడో అట్టి శాంతియుతమైన విధానమునే యీ విషయంలో అనుసరించవలసి యుండుననిరి.

శ్రీ యం. ఏ. ముత్తయ్య చెట్టిగారు భారతప్రధాని సింహళప్రధానితో మాట్లాడి సింహళ భారతీయుల యిబ్బందులను తొలగించుట సులభసాధ్య మగుననిరి.

మహ్మద్ ఇస్మేల్ సింహళములోని మన హైకమిషనర్ అక్కడి పరిస్థితులను బట్టి చేయతగినపని చేయుచున్నారు. మనిషిమారినా పరిస్థితులుమారవు. హైకమిషనర్ అంటే సింహళములో ఇండియా ప్రభుత్వ మన్నమాట. ఇండియా ప్రభుత్వమును విమర్శించుట తగదనిరి. ఈ సమస్యను పరిష్కరించవలగిన సామర్థ్యముగల శక్తి మన ప్రధానమంత్రిగారే. వారు సంతృప్తికరముగా పరిష్కరించ గలరనిరి.

శ్రీ భక్తవత్సలంగారు తీర్మానము చర్చను సమీక్షించుచూ గ్రామాధికారులే గాక యం. యల్. ఏ.లు జిల్లా బోర్డు సభ్యులు ఇచ్చిన ప్రిలిమినరీ సర్టిఫికేటులను అంగీకరించవలెనని రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లకు వుత్తర్వులు ఇవ్వబడెననిరి. సింహళ ప్రజాప్రతినిధుల పంపుటకుగల అనేక గ్రామములు తొలగించుటకు ప్రభుత్వము తీసుకొనిన చర్యలను వివరించిరి.

శ్రీ కోసల్‌రాంగారు సవరణను ఉపసంహరించుకొనగా తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరించబడెను.

### రాష్ట్ర స్మాల్‌కాజుకోర్టు సవరణ బిల్లు ఆమోదం

రాష్ట్ర స్మాల్‌కాజుకోర్టు సవరణ బిల్లును లా శాఖా మంత్రి శ్రీ మాధవమీనన్ గారు ప్రతిపాదిస్తూ 1873 సం॥ సివిల్ కోర్టుల చట్టము అధికారము చలాయించుటకు నియమితమైన జిల్లా మునసబులకు సబార్డినేటు జడ్జీలకు స్మాల్ కాజు అధికారము లొసగబడియున్నవనియు, ప్రావిన్షియల్ స్మాల్ కాజుకోర్టుల చట్టము క్రింద అట్టి ఉద్యోగులకు సెలవు లివ్వటానికి వీలొనర్చే ఉద్దేశ్యముతో చట్టము సవరించవలసి యున్నదనిరి. ఎట్టి చర్చ లేకుండా సభవారు సవరణబిల్లును శాసనముగా ఆమోదించిరి.

మూడవ రీడింగులో శ్రీ విశ్వనాథంగారు మాట్లాడుచూ ఈ ఒక్క బిల్లు విషయంలోనైనా ప్రభుత్వమువారు హైకోర్టు వారి సలహాను అంగీకరించినందుకు సంతోషము తెలిపిరి.

శ్రీ మాధవమీనన్‌గారు గౌరవ సభ్యుడు కుచ్ఛితము అర్థరహితమైన విమర్శచేయుట విచారకరమనిరి.

శ్రీ విశ్వనాథంగారు: మంత్రిగారు భాషాశక్తిని గుర్తించలేకపోయిరి.

ఆ మీదట సవరణబిల్లుకు సభవారు ఆమోదమొసగిరి.

### జంతుబలిరద్దు బిల్లు

నేడు అసెంబ్లీలో అనధికార కార్యక్రమముక్రింద శ్రీ కె. రాజారాంనాయుడు యం. యల్. ఏ. లెజిస్లేటివు కవున్సిలులో అంగీకరించబడిన మదరాసు జంతుబలి రద్దుబిల్లును ప్రతిపాదించిరి. శ్రీ రాజారాంనాయుడుగారు రాష్ట్రములో వివిధ ప్రాంతముల జంతుబలిజరుగుచున్న పద్ధతులను వివరించి ఈ బిల్లుకు అనుకూలముగా అనేకమంది వ్రాశిరని చెప్పిరి.

శ్రీ కోసలరాం బిల్లును బలపరచిరి.

వ్యక్తిగతముగా నేను బిల్లుకు వ్యతిరేకిగాను కాని ఈ బిల్లువలన కొందరి మనోభావములు కించపొందగలవు గాన ఈ బిల్లు గురించి ప్రజాభిప్రాయము తెలుసుకొనుట మంచిదనిరి. ఈ బిల్లును శాసనము చేయుటకు ముందు మున్ముందు ఆలోచించవలెనని చెట్టినాడ్ రాజాగారనిరి.

శ్రీ హైద్రాస్ చెట్టినాడ్ రాజాగారి సవరణను బలపరచిరి.

సభను స్పీకరు డిశంబరు 16 వరకు వాయిదా వేసినట్లు ప్రకటించిరి.

## మదరాసు అసెంబ్లీ ప్రశ్నోత్తరములు

చెన్నపట్నం, నవంబరు 25: మదరాసు అసెంబ్లీలో యీ దినం ప్రశ్నోత్తరముల కాలములో యం. ఏ. మహ్మద్ ఇబ్రాహీముగారు రాష్ట్రములో యిటీవల నెలలందు సిమెంటుకంట్రోలు యేరీతిగా పనిచేస్తున్నదనే విషయమై ఏదైనా నివేదిక ప్రభుత్వానికి అందినదాయని అడిగిరి.

కంట్రోలు పదార్థముల డైరక్టరునుండి ఒక నివేదికను ప్రభుత్వం ఎదురుచూస్తున్నదని పబ్లిక్ వర్క్సు మంత్రిగారు బదులు చెప్పిరి.

### వ్యవసాయాభివృద్ధికి పంచవర్ష ప్రణాళిక

వ్యవసాయాభివృద్ధికై తలపెట్టిన పంచవర్ష ప్రణాళికను మానివేసే ఉద్దేశ్యము లేదని ఆ విషయమై ఒక క్రొత్త పథకము తయారు చేయబడుచున్నదనియు పబ్లిక్ వర్క్సు మంత్రిగారు యస్. మహ్మద్ ఇస్మేల్ గారికి బదులుగా తెలిపిరి.

### ప్రైమరీ విద్యాసంస్థలు

రాష్ట్రములోని ప్రైమరీ ఎలిమెంటరీ విద్యాసంస్థలను స్థానికసంస్థలకు కొలది సంవత్సరములలో ఒప్పగించే ఉద్దేశ్యమేమీ ప్రభుత్వానికి లేదని విద్యామంత్రిగారు యస్. మహ్మద్ ఇస్మేల్ గారి ప్రశ్నకు సమాధానముగా నుడివిరి.

మాన్యంగా ఇచ్చుటకు యితరభూములు లేనట్టయితే గ్రామ కంఠాలుగా ఉపయోగించని పోరంబోకు భూములిచ్చే విషయము ఆలోచించవచ్చునని రివిన్యూ మంత్రి సీతారామరెడ్డిగారు శ్రీ దురైరాజపాండ్యన్ గారికి బదులు చెప్పిరి. రివిన్యూబోర్డువారి తీర్పులు ప్రభుత్వము వారి విధానము అనుసరించే యున్నవని కూడా పలికిరి.

చేనేత వస్త్రవ్యాపారంలో వర్తకులకు సంబంధించిన ప్రశ్నకు సమాధానముగా ఇండియా ప్రభుత్వ... ఒక కోటిరూపాయల చేనేత వస్త్రములను కొనుటకు సమ్మతించియున్నదనియు యీ ప్రభుత్వముకూడా సహకార సంఘములకు సహాయ్య మొసగగలదనియు పరిశ్రమల మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు శ్రీ టి. యస్. పట్టాభిరామన్‌గారి ప్రశ్నకు సమాధానము నొసగుచూ చెప్పిరి. సహకారసంఘములు సక్రమముగా నిర్వహింపబడితే ధరల పెరుగుదల రవాణాఖర్చుల పెరుగుదలవల్ల కలిగే నష్టములనుకూడా ప్రభుత్వము భర్తీ చేయునని పలికిరి. చేనేత వస్త్రముల ధరలను ఒక అంతస్థుకు పునరాగమించుటకు ప్రతిజిల్లా కొక కమిటీని స్థాపించే ఉద్దేశ్యము కలదనిరి.

### అణ్ణామలై విశ్వవిద్యాలయంలో ఆంధ్రులకు రిజర్వేషను

అణ్ణామలై విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కాలేజీలో 30 వంతుస్థానములుగాక 38. 1 స్థానములు ఆంధ్రులకు ప్రత్యేకింపబడియున్నవని జవాబు యం. ఎ.నలాంగారి ప్రశ్నకు సమాధానంగా విద్యామంత్రి తెలిపెను.

## ఎస్టేటు యజమానులచే శిస్తు వసూలు

మదరాసు, నవంబరు 25: జమీందారీ రద్దుచట్టముక్రింద వశమొనర్చుకోబడిన ఎస్టేట్లలో 1357 ఫసలీకి పూర్వము శిస్తుబకాయిలను ఎస్టేటు యజమానే వసూలుచేయవలెనని ప్రభుత్వము సర్క్యులరు ఏమీ పంపలేదనియు, జమీందారీ రద్దుచట్టము శెక్షన్ 55 (1) క్రింద ప్రకటించబడిన తేదీ దరిమిలా ఎస్టేటు యజమానికిశిస్తు బకాయిలను వసూలు చేయుటకు వీలులేదనియు ఏఫసలీకైననూ శిస్తువసూలు అధికారము మేనేజరుకే యున్నదని నేడు అసెంబ్లీలో శ్రీ తెన్నేటి విశ్వనాథముగారికి రివిన్యూ మంత్రి శ్రీ సీతా రామ రెడ్డిగారు తెలిపిరి.

## పెట్రోలు రేషన్ తగ్గింపు ఫలితము

పెట్రోలురేషన్ తగ్గింపువలన రాష్ట్ర ఆదాయముగాని, మోటారు ట్రాఫిక్ గాని దెబ్బతినలేదని ఒక సభ్యుని ప్రశ్నకు ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డి గారు జవాబు యిచ్చిరి.

## శాసనసభ్యులకు కారు పర్మిట్లు

శ్రీ శంకరరావుదేవు ప్రకటనలో తెలిపినట్లు 114 మంది శాసనసభ్యులకు కారు పర్మిట్లు యిచ్చినమాట నిజమేనని ఆర్థిక మంత్రి నేడు అసెంబ్లీలో శ్రీ యం. కన్నియప్పన్‌కు తెలిపిరి. పర్మిట్లు ఇవ్వబడిన సభ్యుల పేర్లు, ఏరకము కారుకు పర్మిటు యిచ్చినదీ తెలుపు జాబితాను సభ్యులకు అందజేసిరి.

జాబితానుబట్టి ఆంధ్ర ప్రాంత శాసనసభ్యులు 37 మందికి కారు పర్మిటు ఇచ్చినట్లు తెలియుచున్నది. వీరిలో రాజ్యాంగపరిషత్ సభ్యులు, కేంద్ర శాసనసభాసభ్యులు కూడా గలరు. 1946 జనవరి దరిమిలా యిద్దరికి మాత్రము కారు పర్మిట్లు రెండుతెపలు యిచ్చినట్లు తెలియుచున్నది. వారు శ్రీయుత సి. అమ్మన్నరాజా, పైడా వెంకటనారాయణ యం. యల్. ఎ. గార్లు.

## పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం

### నివేదికలు పంపకుండుట గూర్చి అసెంబ్లీలో ప్రశ్నలు

మదరాసు, నవంబరు 25: పరిశ్రమలకు ప్రభుత్వ సహాయచట్టము రూలు (17) క్రింద పంపవలసిన వార్షిక నివేదికలను ప్రభుత్వసహాయము పొందుచున్న ఏ కంపెనీ పంపకుండా వుండలేదని శ్రీ తెన్నేటి విశ్వనాథముగారి ప్రశ్నకు పరిశ్రమల మంత్రికిబదులు, శ్రీ సీతారామరెడ్డిగారు జవాబుఇచ్చిరి.

ఆదోని, రాయలసీమమిల్సుకు అప్పు మొత్తము 21-9-49 న పూర్తిగ ఇవ్వబడెననీ, పామిడి రాధాకృష్ణ ఆయిల్ ప్రొడక్ట్సు లిమిటెడ్‌వారికి ఇంకా ఇవ్వలేదనీ అందువలన ఈ రెండుసంస్థలు ఈ సంవత్సరము నివేదికలు పంపవలసిన ప్రసక్తి రాదనియు, మోహన్ ఇన్‌డస్ట్రీసు, తెనాలి సువర్ణ ఆయిల్ మిల్సు లిమిటెడ్‌వారు పంపిన లాభనష్టములపట్టిక, బాలెంసు షీటులు సభ్యులకు ఇవ్వబడెననికూడ మంత్రిగారు తెలిపిరి.

సభ్యులకు అందజేసిన నివేదికలనుబట్టి మోహన్ ఇన్‌డస్ట్రీసు లిమిటెడ్, తెనాలి వారికి 1948 డిశంబరు 31 తో అంతమైన కాలమున నికరనష్టము రు 5037-5-5లు, సువర్ణ ఆయిల్ మిల్సు, కాట్రాడివారికి 1949 మార్చి 31 తో అంతమైన కాలమున సంవత్సరమున నికరనష్టము రు73,532-0-6 లు వచ్చినట్లు తెలియగలదు.

## ఢిల్లీలో ప్రధానుల సమావేశం

ప్రజాక్షేమం నిమిత్తం జవాబుఇచ్చుట మంచి కావని ప్రభుత్వ ఉద్దేశ్యమునిదా,

# సంపాదక లేఖలు

## బళ్లారి జిల్లాబోర్డు తీర్మానం

అర్యా,

కాంగ్రెసుభాషాప్రయుక్త సిద్ధాంతముపై బళ్లారిజిల్లా "ఆంధ్ర" "కర్ణాటక" ప్రాంతములుగా కేల్కారు తీర్పు ప్రకారము విభజింపబడి, గత దాదాపు రెండుదశాబ్దములనుండి రెండు ప్రాంతీయ జిల్లా కాంగ్రెసు సంఘము లిచ్చట పనిచేయుచున్నవి.

ఈజిల్లాబోర్డు ఈ జిల్లా విషయమై తీర్మానించిన సమావేశంలో వోటింగు ప్రకారము, 17 మంది ప్రతికూలురుండుటకూడ, జిల్లాలో ప్రతి 28 మందికి 17 గురు తెలుగువారని రూఢి చేయుచున్నది. అనగా అర్ధభాగముకంటె ఎక్కువే. మెజారిటీ వున్నంత మాత్రమున, ఇంత గొప్ప సంఖ్యగల తెలుగుభాషవారి శ్రేయస్సుకు భంగకరమైన తీర్మానమును, జిల్లాబోర్డులో తెచ్చుట, మున్ముందీ జిల్లాలో అన్యోన్యతకు అఘాతమని ఇంగితజ్ఞులు గ్రహింపకపోరు. తమ సాధారణ విధులకు కడుమారమైన సమస్యలోనికి తమార్చి చట్టప్రకారము తమకున్న విధులను నిర్వర్తించుటలో ప్రముఖులకుట కిట్టి విధానము దారితీయును. వివాదకరమైన సమస్య ప్రసక్తిలోని కింకదిగక చట్టబద్ధమైన తమవిధులను సరిగా నిర్వర్తింప తగునని వీరిని మందలింపవలసిన అగత్యము ప్రభుత్వమువారు గుర్తింపవలెను.

అప్రస్తుత ప్రశంసగానున్న ఈ తీర్మానము, భాషాప్రయుక్త విభజన సిద్ధాంతముతో ఏ సంబంధములేనివారు ఆమోదించిన యీ తీర్మానమును చిత్తుకాగితంతో సమానంగా పరిగణింపవలెను. (ఒకవిలేఖరి)

* * *

## ఒంగోలుజాతి పశువృద్ధి పరిశోధక ఫారము

ఆర్యా,

గుంటూరుకు 5 మైళ్ళలోగల లాములో ఒంగోలుజాతి పశువృద్ధికొరకు సర్కారు ఫారం వున్నది. అజాతి పుట్టుక గుండ్లకమ్మనదీప్రాంతము. అది గట్టినేల, మంచి బీళ్ళుగల ప్రదేశము. లాము సముద్రపదేశపు రేగడ నేలకలిగి మంచి బీడు, నీరుకు కరువయినచోటు. ఇక్కడ 30 యేండ్లనుండి ఈ ఫారము లక్షలు ఖర్చుపెట్టి నడుపుచున్నారు. అప్పుడప్పుడు పనికిరాని పశువులను వేలం వేయుట, ఎప్పుడో ఎవరికో కొన్ని ఆంబోతులు దొరుకుటతప్ప దీనివల్ల ఎక్కువ ఫలితము లేదు. ఆ ఆంబోతుదూడలకు హెరువము కూడా తక్కువ అని అనుభవజ్ఞులు వారలందురు. ఫారందోవన బోయ్యే రయితులు ఆ పశువుల దుస్థితి ఆ గారాబు పెంపకముచూచి దుఃఖపడుచుందురు.

వీటికితోడు ఢిల్లీ పోతులు, బర్రెలు వున్నవి. వాటికి నీరు పుష్కలముగా వుండవలెను. ఈ నీరులేనిచోట వాటిని పెంచుట విచిత్రము. ఎంత ఖర్చుకు ఎన్ని ఆంబోతులు ప్రతియేటా దేశానికి ఈ ఫారంనుండి సరఫరా అగుచున్నవో? రయితులకు మంత్రులు, ఒంగోలు జాతి వృద్ధి, ఢిల్లీ, బర్రెల వృద్ధి అనుకూల పరిస్థితులలో జరుగుచున్నదని సంతృప్తిపడుచున్నారనియు ప్రజలు అనుకొనవలెనా, లేక వెటర్నరీ డిపార్టుమెంట్ల నిపుణులకు అడ్డము చెప్పలేక ఊరకున్నారు అని ప్రజలు అనుకొనవలెనా? ఈ ఫారము లోని భాగమా అన్నట్టు వ్యవసాయ డిపార్టుమెంటు క్రింద వ్యవసాయ ఫారము కూడా ఉన్నది.

మనప్రాంతములో రయితు అనగా ఆయన భూమి, పశువులు, కోళ్లు ఒక అవిభాగమయిన సంపత్తుగా భావించవలెను. ఒకటిలో ఒకటి అతికిఉన్న సంసారము, అవినాభావముగా ఉన్న ఈ రయితు సంసారము ఆర్థికస్థితి బాగుచేయుటకు వ్యవసాయ పరిశోధన ఉండవలె గదా! ఈ దృష్టి ఇంతవరకు వ్యవసాయ డిపార్టుమెంటు పరిశోధన స్థానములలో లేదు. ఇప్పుడు అయినా రయితుల మంత్రులు వచ్చినతర్వాత పరిశోధన దృక్పథము, గుడ్డిగా పాశ్చాత్య అనుకరణము గాకుండా వారి మంచి తీసుకొని, మన పరిస్థితులకు తగినట్టుమార్పుచేసుకొనవలెను.

పేర్లకు వ్యవసాయ డిపార్టుమెంటు, పశువులకు వెటర్నరీ డిపార్టుమెంటు మధ్య రయితు నలగవలసి వస్తున్నది. పోనీ ఈ రెండు డిపార్టుమెంట్లు కలిసి పనిచేయునా? అదీలేదు.

లాములోయుండు ఈ పశువుల, వ్యవసాయ స్థానములను రెంటిని కలిపి వ్యవసాయ డిపార్టుమెంటు క్రింద మిశ్రమ ఫార్మింగు పరిశోధన స్థానముగా మార్చి ఉపయోగమగునట్లు చేయుమని వేడుచున్నాను. ఒంగోలు జాతివృద్ధి ఒంగోలు ప్రాంతములోను, ఢిల్లీ బర్రెలవృద్ధి, నీరు పుష్కలముగా ఉండు సీతానగరం సెటిలుమెంటు, క్రిష్ణలంకల వద్దను జరుపుట భావ్యముగును. అసెంబ్లీ మెంబర్లు, గౌ॥ చంద్రమౌళి, గోపాలరెడ్డి, సంజీవరెడ్డి, సీతారామరెడ్డిగార్లు తెనుగు సీమలో యున్న ఈ స్థానములను ఉపయోగకరంతముగా చేయ వేడుచున్నాను.

తాడేపల్లి పరమానందము, యల్. ఏ. జీ. గుంటూరు.

* * *

## శేకూరుగ్రామప్రజలఅవస్థలు

అర్యా,

గుంటూరు తాలూకా శేకూరు గ్రామం మాగాని, పసుపుతోటలు వరదవల్ల మునిగిపోయి పైరు పైనను, శేకూరు గ్రామం నుంచి పంగం జాగర్ల మూడి స్టేషనుకు వచ్చే రోడ్డు పైనను 3,4 అడుగులలోతు నీరు ప్రవహించినది మురుగు కాల్వలు లేని కారణంచేత 10 రోజులవరకు నీరు నిల్వయుండి పైరులు కుళ్ళిపోయినవి. ఆ సమయంలో ప్రభుత్వాధికారులు ఎవరు మా గ్రామం వచ్చి మా ఇక్కట్లు చూచినవారులేరు. ఇప్పటికైనను గుంటూరు నుండి తెనాలి వచ్చే రైలులో కూర్చుని శేకూరు గ్రామ భూములవంక చూస్తే భూములలోని పైరు ఏమయినది కానవచ్చును. కనుక ఈ విషయమై వెంటనే శ్రద్ధతీసుకో గోరుచున్నాను,

అమునుపల్లి కోటయ్య
గుంటూరు తాలూకా కాంగ్రెస్ సభ్యుడు

# నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'ఛోటా భాయ్' |
| స్టార్ | 'సమ్మగ్రా త్రివర్ణ చిత్రాలు' |
| వెల్లింగ్టన్ } ప్రభాత్ } | 'అపూర్వ సహోదరగళ్' |
| పారగన్ | తమిళ 'లైలామజ్ను' |
| గెయిటీ | 'లాడ్లీ' |
| బ్రాడ్వే | 'ప్రా॥ ఘోష్ మాజిక్ ప్రదర్శనం' |
| క్రౌన్ | తెలుగు 'లైలామజ్ను' |
| సెలెక్టు | 'సంసారం' |
| సరస్వతి | 'చక్రధారి' |
| మహారాణి | 'హరిదాస్' |
| Casino. | 'Home of the Brave' |
| New Elphinstone: | 'House of Strangers' |
| Minerva: | 'Sea Hawk' |
| Midland : | 'Forever Amber' |
| New Globe: | 'See you on Flamingo Road, |
| Roxy : | 'Adventures of Casanova' |

## ఇండియాకు అమెరికాఫిలిం అధిపతి ప్రయాణం

లండన్, నవంబరు 24:

కొన్నేళ్ల మెకర్తానీ అనే అమెరికా ఫిల్ము అధిపతి 'డరివరర్' అనేఫిల్ములో కొన్నిభాగాలు తీయడానికి విమానం మీద ఇండియా వస్తున్నాడని తెలుస్తున్నది. ఈ యన హాల్లీ వదిమీద కొన్నిరంగాలు ఫిల్ముతీస్తారట, ఈయన 3 నెలల్లో ఇండియాలో తమపని ముగించుకో గలరని తెలుస్తున్నది.

ఈ యనే "ఓరియంటల్ ఇంటర్నేషనల్ ఫిల్ము కార్పొరేషన్ 'అనే ఫిల్ము సంస్థకుఅధిపతి. ఇందులో ఇంచుమించుగా 75 పాళ్ళ వాటాలు భారతీయుల వేనట. మిగిలిన వాటాలు అమెరికావారు తీసుకుంటారు, ఇండియాకు ఇచ్చే ధనం డాలర్ల రూపంలో ఇవ్వబడుతుందని గూడా ఈ యన చెప్పారు.

పాట్రీషి యా వాల్టర్స్ అనే కళాకర్త యువతి ఈ యన ఫిల్ములో నటించగలదనీ, ఈ ఫిల్ముకు హిందీ అనువాదం కూడా తయారు చెయ్యబడగలదనీ మెకర్తానీ చెప్పారు.

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 28 సోమవారం

## మద్రాసు (ఎ)

7-0 స్వాగతం 7-30 ఎ. లలిత 8-15 ఉదయ సంగీతము (రి) 8-30 (బి) వలె 1.40 సినీమా సంగీతము 2-10 (బి) వలె 2-45 (బి) వలె 5-30 ఎమ్. ఎస్. కమలా దేవి 6-10 ప్రకటనలు మొ॥ 6-20 ఎమ్ సభాపతి అయ్యర్ వీణ 7-30 గీతమంజరి (రి) 7-45 జంత్రసమ్మేళనం 8-0 (బి) వలె 8-30 ఎస్. శంకరన్ 9-15 (బి) వలె 10-0 సినీమా సంగీతము (రి)

## మద్రాసు (బి)

7-0 వార్తలు 7-15 కున్నక్కుడి వెంకట్రామయ్యర్ (రి) 7-45 (ఎ) వలె; 8-30 ఇగ్. శ్రీనివాసన్; 12-0 కార్మికుల కార్యక్రమం; 12-30 మిడిల్‌స్కూళ్ళకు; 1-0 (ఎ) వలె; 1-50 వార్తలు; 2-0 క్లారినెట్: నిలయ విద్వాంసుడు; 2-15 (ఎ) వలె; 2-45 కదంబము (రి, 4-0 ఎలిమెంటరీ స్కూళ్ళకు; 4-30 (ఎ) వలె; 5-30 (ఎ) వలె; 6-20 సాయంసంగీతము (రి); 6-30 గ్రామస్థుల కార్యక్రమం; 7-0 వార్తలు; 7-15 గ్రామస్థుల కార్యక్రమం; 8-0 ఎమ్. కల్పకం; 8-30 (ఎ)వలె; 9-15 ఉయ్యాల అగ్రహారి ప్రదర్శన; 9-30 ఎ. ఎస్. చెంగల్వరాయన్ ఫిడేలు; 10-0(ఎ) వలె.

## విజయవాడ

7 వార్తలు. 7-15 అనంత లక్ష్మీశత కోపన్, 7-30 చేబ్రోలు జోగేశ్వర శాస్త్రి, వీణ. 8-15 గీతావళి బి. రవీంద్రనాథ్. 8-30 డి. పార్వతి 12-30. మిడిల్ స్కూళ్లకు. 1 తారాపథం (రి). 1-40 వాద్య సంగీతం (రి). 1-50 వార్తలు. 2 గానసుధ (రి). 2-15 హైస్కూళ్లకు. 4 ఎలిమెంటరీ స్కూళ్లకు. 5-30 చేబ్రోలు జోగేశ్వర శాస్త్రి వీణ. 6-10 ప్రకటనలు వగైరా. 6-20 గీతావళి బి. రవీంద్రనాథ్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. 7 వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం. 7-30 చిత్రవాణి (రి) 7-45 పరస్పర సహకారము. జాతీయనిధి, ప్రసంగము, కె. కోటి రెడ్డి, ఎమ్. ఎల్. ఏ. 8 విష్ణు సర్వ శాస్త్రి ఫిడేలు. 8-30 డి. పార్వతి. 9-30 విష్ణు సర్వ శాస్త్రి ఫిడేలు 10 ప్రసార సమాప్తి.

## హైద్రాబాదు

7-30 గీతాలు (రి), 7-45 రూహుల్లా హుసేని, 8-20 బి. కె. రంగాచారి కర్నాటక సంగీతం, 8-50 వార్తలు, 9-15 గులాంసిద్దిక్ ఖాన్, 12-30 మజ్‌బూరియన్ (రి), 1 బాలత్రిపురసుందరి.వి.(రి) 1-25 కార్మికులకు ప్రసంగం, 1-40 అంజలీదేవి(రి), 1-50 వార్తలు, 5 రూహుల్లా హుసేని, 5-10 శాంతిరంజన్, 6-30 పిల్లల కార్యక్రమం, 7 వార్తలు, 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-55 రూహుల్లా హుసేని, 8-30 గులాంసిద్దిక్ ఖాన్, 8-40 బి. కె. రంగాచారి, 9-15 శ్రోతల పరిచయం, 9-25 గులాంసిద్దిక్ ఖాను, 9-55 శ్రోతలు కోరిన రికార్డులు.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 26:

**బంగారు - వెండి నేటి మధ్యాహ్నం**

1 గంటకు పవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 77-2-0 పెట్లా బంగారు తులం 115-4-0 మూసబంగారు 118-0-0 సీమవెండి తులం 100-కి (రెడీ) 178-0-0 వెండి తులం 1 కి 1-12-0

**వేరుసెనగ:** (581 పౌ 1-కి ఎక్సు కోస్టాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారుక్షేత్రం. (కోరమాండల్)
157-0-0, 158-8-0

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (వివరెబ)
డిసెంబరు డెలివరీ రు. 336,-337

3 టు 5% యఫ్. యమ్. ఎ.,
కొంకాయనూనె(87 పౌన్లు గల వర్ణ్యాన్) ఒకటికి కొచ్చిన్ క్వీలాన్.
రు. 36-0-9, 37-0-8

**ఆముదం**

కాంకి 500 పౌనులుగలది చిల్లరగా
రు. 250-0-0, 260-0-0 (ఒంగోలు)
రు. 280 290 (నరసరావుపేట)

**పంచదార**

ప్యారీ (2 అంగుళ) రు.91-14-6

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 25:

డిశంబరు 29.91 / 29.91 మార్చి 29.97 / 29 97 మే 29.92 / 29.92 జూలై 29.65/29.66 అక్టోబర్ 28 24/ 28.25 డిశంబరు 28.14 / 28.14

మార్చి

| | | |
|---|---|---|
| హెడ్జింగ్ | పోజరు | 30 55 |
| డిశంబరు | (గరిష్ఠధర) | 29.91 |
| | (కనిష్ఠ ధర) | 29.86 |

**డిసంబరు వాయిదా ధరలు**

| | |
|---|---|
| నేటి ప్రారంభం వెల | 29.87 |
| నిన్న | 29.91 |

# చిత్తూరును ఆంధ్రలో నే చేర్చాలి

## జిల్లాబోర్డు తీర్మానం

### బోర్డు ఉపాధ్యక్షుని ఎన్నిక వాయిదా

చిత్తూరు, నవంబరు 25: చిత్తూరు జిల్లా బోర్డు కాంగ్రెసు పక్ష సభ్యుల తొలి సమావేశం నేడు ఎస్. పి. చెంగల్రాయ నాయుడుగారి అధ్యక్షతను జరిగింది. సభకు 44 గురు కాంగ్రెసు సభ్యులలో 32 మంది హాజరయ్యారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గంవారు జిల్లాబోర్డు ఉపాధ్యక్షుని ఎన్నికలో ఆర్. రామచంద్రారెడ్డి గారిని బలపరచి గెలిపించవలెనని సిఫార్సు చేస్తూ యిచ్చిన తంతిని సభ్యులకు చదివి వినిపింపగా, పంకాయలపాటి మునిస్వామి నాయుడుగారు దానిని ప్రతిఘటించిరి.

అధ్యక్షుని ఎన్నికలోనూ కార్యవర్గంవారు నిర్ణయంచేసి, ఇప్పుడు ఉపాధ్యక్షుని ఎన్నికలోనూ వారే నిర్ణయంచేయజూస్తే తాము సహించమనీ, ఆం. రా. కాం. కార్యవర్గం జిల్లాబోర్డు కాంగ్రెసు సభ్యులతో సంప్రదించినమీదగాని అభ్యర్థిని నిర్ణయించరాదనీ, ఎన్నికను మరుసటి సమావేశంవరకూ వాయిదా వెయ్యాలనీ ఆయన తీర్మానం ప్రతిపాదించారు ఓటింగులో తీర్మానానికి అనుకూలంగా 21, వ్యతిరేకంగా 8 ఓట్లు వచ్చాయి. 3 గురు తటస్థంగావున్నారు. తీర్మానం గెలిచింది.

జిల్లాబోర్డు సభ్యుల సమావేశం నేటి మధ్యాహ్నం చెంగల్రాయనాయుడుగారి అధ్యక్షతక్రింద జరిగింది. సమావేశప్రారంభంలో జరుగవలసివున్న ఉపాధ్యక్షుని ఎన్నిక, హైతగినంతమంది సభ్యులు హాజరుకానందున టచేవాయిదా వేయబడింది. ఎన్నిక సమయం దాటిపోగానే సభ్యులందరూ హాజరయ్యారు. నాటికి 97 మంది ఆంధ్రులు నివసిస్తున్న చిత్తూరు జిల్లాను ఆంధ్రరాష్ట్రంలోనే చేర్చాలని ప్రభుత్వమును కోరుతూ మునిరత్నం నాయుడుగారు ప్రతిపాదించిన తీర్మానము బలపరుస్తూ సుబ్రహ్మణ్యం రాజు, జె. వెంకటరావు, గార్లు ప్రసంగించారు. తీర్మానం ఓటుకు పెట్టగా, అధిక సంఖ్యాబలంతో ఆమోదింపబడింది. ఆంధ్రరాష్ట్రమునకు మద్రాసే రాజధానిగా ఉండాలనికూడా తీర్మానంలో కోరబడినది.

# మహా విదర్భరాష్ట్రం త్వరలో ఏర్పడవచ్చు

## సి. పి. కాంగ్రెస్ అధ్యక్షుని విశ్వాసం

హైదరాబాదు, నవంబరు 24: మహా విదర్భరాష్ట్రం అనతికాలంలో, అవతరిస్తుందని తాను విశ్వసిస్తున్నట్లు సి. పి. రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడు కన్నంవార్ నేడిక్కడ విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

సి. పి. బీహార్ రాష్ట్రంలోని మహా రాష్ట్రజిల్లాలను విడదీసి మహా విదర్భ రాష్ట్రం ఏర్పరచాలన్న సూచనను తాని దవరకే రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారికి నివేదించాననీ, రాష్ట్ర నాయకులలో పలువురు ఈ సూచనను సమర్థిస్తున్నారనీ, ఇతరులుకూడా దానిని సమర్థిస్తారని ఆశిస్తున్నాననీ ఆయన అన్నారు.

హైదరాబాదుకు స్వంత పనిమీద వచ్చిన కన్నంవార్ సంస్థాన పోటీకాంగ్రెస్ నాయకుడు బి. రామకృష్ణరావు గారిని, కాంగ్రెస్ అధికారవర్గానికి చెందిన డి. జి. బిందూగారిని కలుసుకొని రాజీసంభాషణల ప్రసక్తి తెలుసుకున్నారు. సంస్థానకాంగ్రెసును భారత కాంగ్రెసులో కలిపివేయుటమే ప్రతిష్టంభనా పరిష్కారమార్గమని కన్నంవార్ అభిప్రాయపడ్డారు.

ఐక్యమహారాష్ట్రం అనేక కారణాల చేత ఇప్పట్లో ఏర్పడకపోవచ్చుననీ, స్వయంపోషకశక్తి సమృద్ధిగాగలిగిన మహా విదర్భరాష్ట్రం ముందు ఏర్పడితే అది చాలా ఆరోగ్యకరంగా ఫలించగలదని ఆయన చెప్పారు. (స్వ. వి.)

## "మనదేశం" ప్రదర్శన

విజయవాడ, నవంబరు 25: ... యను 9 గం శ్రీ దుర్గ ... "మనదేశము" చిత్రము, ... పత్రికావిలేఖరులకు ...

## నోటీసు

**వాండ్రాసి సూర్యనారాయణ,** పార్వతీపురం తాలూకా, గుమ్మ గ్రామము లోని నా చనిపోయిన సోదరుడు రామమూర్తి నాయుడుగారి కుమారుడు, సదరు సూర్యనారాయణ ఒక జాయింటు సోదరుడు, మగ్గురు మైనరు కుమార్లు, ఒక కూతురు భార్య కలరు. అతనిది జాయింటు కుటుంబము. సదరు సూర్యనారాయణ దుస్సహవాసమునకు లోనై ఒక సంవత్సరమునుండి అక్రమమైన పనులకు అప్పులు చేయుచున్నాడు. అతడు ప్రతిఫలము లేకుండ, అవినీతిపనులకు, దాఖ్లు, ప్రోనోట్లు వగైరాలు గూడ వ్రాయుచున్నట్లు తెలియుచున్నది. అవి జాయింటుకుటుంబములోని యితర తోడి భాగస్తులను బద్ధపడుపవు. అందువల్ల అట్టి అప్పులు కుటుంబ ఆస్తులవల్ల చట్టసమ్మతముగా రాబట్టుకొనబడజాలవు. కాబట్టి, సదరు వాండ్రాసి సూర్యనారాయణవల్ల చేయబడిన ప్రస్తుతపు అప్పులు గాని, ముందుచేయబోవు అప్పులు గాని, అన్యాక్రాంతములు గాని, ఏ విధమైన లావాదేవీలు గూడ నన్ను గాని, అతని కుటుంబములోని యితర మెంబర్లను గాని బద్ధపరుపవని యిందుకు సంబంధించిన యావన్మందికి ఇందుమూలముగ తెలియపరచడమైనది.

వాండ్రాసి గోపినాథం నాయుడుగారి వ్రాలు.
గుమ్మ గ్రామము, పార్వతీపురము తాలూకా.
విశాఖ వాట్న డిస్ట్రిక్టు.

వాండ్రాసి గోపినాథం నాయుడు
వ్రాలు.

## టెండరు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

### మద్రాసు, రాయపురం రైల్వే స్టోరు డిపోవద్ద ఆహారధాన్యముల వేస్టు స్టోరులు కొనుటకు టెండర్లు

**రా**యపురం, స్టోరు డిపోవద్ద నున్న ఆహారధాన్యముల వేస్ట స్టోరులు కొనుటకు సీలుచేసిన టెండర్లు కోరబడుచున్నవి.

2. టెండర్లు నిర్ణీత ఫారములో పంపవలెను. ఫారము ఖరీదు రు 1/- (ఒక రూపాయ మాత్రమే) మద్రాసు, పార్కు టౌనులోని యీ రైల్వే పే-మాస్టరు అండ్ కాషియరుకు చెల్లించవలెను.

3. టెండర్లు పెట్టదలచినవారు టెండరు ఫారము ఖరీదుక్రింద చెల్లించిన సొమ్మునకు, పే-మాస్టర్ అండ్ కాషియరువల్ల యివ్వబడు ఆఫీషియల్ రశీదును చూపించి, దిగువ సంతకముదారు ఆఫీసునుండి షరతులు నిబంధనలతో సహా టెండరు ఫారము పొందవలెను. టెండరు ఫారము ఒకరిది మరియొకరికి మార్పుకొనగూడదు. దాని ఖరీదు వాపసు చేయబడదు.

4. పూర్తిచేసిన టెండరు తీసుకొనుటకు ఆఖరు తేది 19-12-49 సా॥ 3 గంటలు.

పార్కు టౌన్, మద్రాసు. తేది 24-11-49. } సూపరింటెండెంటు, (గ్రెయిన్ షాప్సు)

## నోటీసు

### మద్రాసు హైకోర్టు ఆఫ్ జూడికేచర్
ఆర్డినరి ఒరిజినల్ సివిల్ జూరిస్ డిక్షన్.
సి. పి. నెం 359 ఆఫ్ 1949.

1913 ఇండియన్ కంపెనీల చట్టము విషయములోను, మోటార్సు అండ్ జనరల్ స్టోర్సు లిమిటెడ్ విషయములోను.

పిటీషనరు:- మోటార్సు అండ్ జనరల్ స్టోర్సు లిమిటెడ్, బొంబాయి.

**ఇందు మూలమున** తెలియపరచునదేమనగా, ప్రత్యేక తీర్మానము ద్వారా కంపెనీ ఉద్దేశ్యములను మార్చుటకు తలపెట్టిన మార్పును ఖాయపరచుటకుగాను 1913 ఇండియన్ కంపెనీల చట్టము 12-వ సెక్షను క్రింద ఒక పిటీషను కంపెనీవారిచే 8-11-49 తేదీన దాఖలు చేయబడగా సదరు పిటీషను 12-12-49 సోమవారము ఛేంబర్సులో కోర్టును జరుపు జడ్జిగారియెదుట విచారింపబడుటకు డైరెక్టు కాబడియున్నది.

పిటీషనులో కోరిన మాదిరి ఉత్తరువు చేయుట గురించి యెవరైనను బలపరచదలచి గాని ప్రతిఘటింపదలచిగాని యున్న యెడల విచారణ సమయమున స్వయముగా గాని అడ్వకేటు ద్వారా గాని హాజరు కావలెను. పిటీషను కాపీ కావలసిన యెవరికైనను దిగువ సంతకముదారుకు నిర్ణీత రుసుము చెల్లించినమీదట సప్లయి చేయబడును.

(సం) ఆర్. నరసింహాచారి,
పిటీషనర్ తరఫు అడ్వకేటు.
371, ఎస్ప్లనేడ్, జి. టి. మద్రాసు.

నోటు:—సదరు పిటీషను విచారణ సమయమున హాజరు కావలచిన యెవరైనను తా తావిధముగా చేయదలచినట్లు పైన తెలిపిన వారికి ఒక నోటీసు అందజేయవలెను. లేదా పోస్టులో పంపవలెను. సదరు నోటీసులో అతని పేరు, అడ్రెసు, ఫరం అయినచో సంస్థ పేరు అడ్రెసు వ్రాసి, సదరు వ్యక్తి గాని, ఫరంగాని, లేదా అతని, లేదా ఫరం అడ్వకేటు గాని, సంతకము చేసి, 11-12-1949 సా. 8 గంటలు దాటకుండ పైన తెలిపిన వారికి చేరునట్లు అందజేయవలెను లేదా పోస్టులో పంపవలెను.

# విజయవాడలో రాష్ట్రపతి జన్మదినోత్సవం

## దేశ నాయకులందరినుండి సందేశాలు

విజయవాడ, నవంబర్ 25: కాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్య గారి 70 వ జన్మదినోత్సవం నిన్న నిక్కడ ఘనంగా జరిగింది. అనేక సంస్థల వారిందులో పాల్గొన్నారు. కస్తూరిబా ఆశ్రమం హరిజన, విద్యార్థిసంఘాలు కూడా ఉత్సవంజరిపాయి. ఉదయం ప్రభాతభేరీ, డాక్టరుగారి ఆయురారోగ్యములకై ప్రార్థనలు జరిగినవి. సాయంత్రం సైకిల్ ఊరేగింపు జరిగింది. పిమ్మటకొత్తపేటలో పాతిన గణపతిరావు పాత్రుడు గారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగింది. శుభాకాంక్షలు తెలుపుతూ సర్దార్ పటేల్, ఎమ్. ఎస్. అణే, కళా వెంకట్రావు, ఎస్. కె. పాటిల్, పురుషోత్తందాసు టాండన్, మేజర్ జనరల్ జె. ఎన్. చౌదరీ, ఎన్. వి. గాడ్గిల్, మోహన్లాల్ శక్సేనా, గార్లు సందేశాలుపంపారు. ఈ సందేశాలను రాజకీయ బాధితుల సంఘ కార్యదర్శి రాయని రాములుగారు చదివారు.

డా॥ పట్టాభి కాంగ్రెసువాదులలోకెల్ల అతి ప్రాచీనుడు. ఆయన దేశస్వాతంత్ర్యోద్యమంలో ఎన్నో బాధలు పడ్డారు. ఆయన 70 వ జన్మదినమును విజయవాడ రాజకీయ బాధితుల సంఘంవారు జరపటం సముచితంగా వున్నది." అని మోహన్లాల్ శక్సేనా సందేశం పంపారు. మద్రాసు ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజా ఇలా సందేశమిచ్చారు.

"రాష్ట్రపతి పట్టాభి జన్మదినం జరపటం మనకు ప్రత్యేక గౌరవాపాదకం. ఆయన దేశసేవ గణనాతీతము. ముందు కూడా వారి నాయకత్వ భాగ్యం మనకు లభించుగాక."

బి. గోపాలరెడ్డిగారిలా అన్నారు. "చాల లాభవంతమైన వైద్యవృత్తిని త్యజించి డా॥ పట్టాభి దేశసేవకు జీవితము నంకితం చేశారు. ఆయన ప్రజ్ఞ బహుముఖమైనది. ఆయన హస్తవిశేషంవల్ల ఎన్నో సంస్థలు రూపందాల్చినవి" రంగాగారు సందేశమిస్తూ, ఆంధ్ర రాష్ట్రనిర్మాణము ననిజం చెయ్యగలగడంవల్ల డా॥ పట్టాభి రాష్ట్రపతిత్వకాలం మనకు చిరస్మరణీయమైనదని అన్నారు.

స్వామీ రామానందతీర్థ ఇలాగ అన్నారు. "భారత రాజకీయ జీవితంలో మాయని ముద్రవేసిన ప్రజ్ఞాధురీణుల్లో డా॥ పట్టాభి ఒకరు. ఆయన విజ్ఞానం అపారము. ఆయన చాకచక్యం నిరుపమానం." పండిట్ గోవిందవల్లభపంత్ ఇలా అన్నారు. "యావజ్జీవితమూ డా॥ పట్టాభి స్వాతంత్ర్యయోధుడుగానే వున్నారు."

మద్రాసు మంత్రులలో డా॥ రాజన్, సీతారామరెడ్డి, చంద్రమౌళి, ఎ. బి. షెట్టి, భక్తవత్సలంగార్లు, మైసూరు విశ్వవిద్యాలయ ప్రోచాన్సెలర్ సి. ఆర్. రెడ్డి, మహారాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుకూడ సందేశాలు పంపారు.

సందేశాలైనతర్వాత మరుపిళ్ల చిట్టి, వేదాంతకవి, బసవరాజు రంగరాయిగార్లు ఉపన్యసించారు. రాయని రాములుగారి వందనములతో సభ ముగిసింది. (స్వ. వి.)

# బందరులో సభ

బందరు, నవంబరు 25: డా॥ పట్టాభి సీతారామయ్యగారి 70 వ జన్మదినోత్సవం నిన్న టిరోజున వారి స్వస్థలమగు బందరులో అతివైభవంగాజరిగింది. అనేకసంస్థలు ఇందులో పాల్గొన్నాయి. జాతీయసేవా సంఘంవారు, సీతారామ లైబ్రరీవారు కలిసి "ఆంధ్రకేసరి" కార్యాలయంలో పి. లక్ష్మీపతి శాస్త్రిగారి అధ్యక్షత క్రింద సభ చేశారు.

ఈ సభలో రాజేశ్వరీ అమ్మాళ్, ఘన అమ్మాళ్ సంగీతకచ్చేరి చేశారు. అక్కిపల్లి జగన్నాథరావు, నిమ్మగడ్డ నాగేశ్వరరావు, లక్ష్మీరాజ్యం, వాణి కస్తూరిబాయి జాతీయగీతాలు పాడారు. అక్కిపల్లి కుటుంబరావుగారు పట్టాభిగారిపై గీతాలు పాడారు. రాష్ట్రపతిని 70 వ జన్మదిన సందర్భంలో అభినందిస్తూ, ముఖ్యంగా ఆయన కాంగ్రెసు అధినేతగా వున్న సమయంలో భారత రిపబ్లిక్ అవతరిస్తున్నందుకు సంతోషం తెలుపుతూ తీర్మానం చేశారు. రాష్ట్రపతికి 50 ఏళ్లనుంచి ఆవాసంగావున్న బందరునే ఆంధ్ర రాజధానిగా చెయ్యాలని ఆంధ్రులందరూ ఏకగ్రీవంగా ఒత్తిడి జరపాలని మరొక తీర్మానం చేయబడింది.

మునిసిపల్ ఛైర్మన్ అచ్యుతరామయ్య గారి అధ్యక్షత క్రింద మునిసిపల్ పార్కులో పట్టణ కాంగ్రెసువారు బహిరంగసభ జరిపారు

# వారఫలాలు

### నవంబరు 27 వ తేదీ మొదలు డిశంబరు 3 వ తేదీవరకు

## గ్రహస్థితి

రవి బుధులు (వృశ్చికం) కుజ శనులు (సింహం) గురువు (మకరం) శుక్రుడు (28 వరకు ధనస్సు తర్వాత మకరం) రాహువు (మీనం) చంద్రుడు (కుంభ, మీన, మేషాల్లో) 27 బుధ చంద్ర (కేంద్రం). 28 శనిచంద్ర, కుజచంద్ర (సమసప్తకం) 30 బుధచంద్ర (కోణం) రాహుచంద్ర (యుతి) 1 శని, కుజ (యుతి) శుక్ర చంద్ర (కోణం) 2 గురుచంద్ర (కేంద్రం) బుధ, రాహు (కోణం) 3 శని చంద్ర-కుజ చంద్ర (కోణం)

## ధరలు

### వెండి-బంగారాలు

1 వ తేదీ మార్కెట్టు కొంత జోరుగా హెచ్చి చివరకు కొంత తగ్గుతుంది.

### వాటాలు

ఎక్కువ వ్యత్యాసాలుండవు. 1 2 ల్లో చెప్పదగ్గ కొంత హెచ్చుతవి.

### ధాన్యములు - ఆహారవస్తువులు

పొట్టు ధాన్యములకు నిలకడ, నూనెలూ పసుపూ - ఫలపుష్పవస్తువులూ మరికొంత హెచ్చును.

### వర్షము

29, 30 తేదీలలో నైరృతి జిల్లాలలో స్వల్పవర్షము.

## లగ్న ఫలాలు

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1వపాదం)

ఈ వారంలో 27, 28 ల్లో మీ శ్రేయోభిలాషులను కలుస్తారు. దూర ప్రయాణానికి సంకల్పాలుచేస్తారు. నూతన యత్నానికి అనుకూలం. 29, 30, 1 ల్లో కుటుంబపరిస్థితులు విశ్రాంతి నివ్వవు. వ్యాపారాదుల్లో లెక్కల్లో పొరపాట్లు కలుగుతవి. అనవసరముగ డబ్బు చేతికిరాదు. వారాంతంలో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. సంఘవ్యవహారాల్లో విజయం చేకూరుతుంది. 2 శుభవార్త.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2. పాదాలు)

ఈ వారంలో 27, 28 ల్లో చిన్న ప్రయాణం ఆప్తులనూ బంధువులనూ కలవడం ఉత్సాహాన్ని కలిగించే ముచ్చటలూ జరుగుతవి. 29, 30 ల్లో నూతనయత్నం పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. 2,3 ల్లో డబ్బు ఖర్చులకు మితియుండదు. ప్రయాణం ఆటాలున ఆగిపోవడం అప్తులనురించిన అశుభవార్త మనస్సును కొంత కలచ కలవు. కాని 3 సాయంత్రానికే సందేహాలు నివృత్తియై సంతోషం కలుగుతుంది. 28 శుభవార్త.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 27, 28 ల్లో ఆరోగ్యం తిన్నగా యుండదు. సంఘవ్యవహారాల్లో మిత్రులనుకొనువారు ఆఘాతంగం కలిగిస్తారు. 29, 30, 1 ల్లో ఉద్యోగ ఉద్యమాల్లో కార్యావసరంపై గౌరవస్థులనూ అధికార్లనూ కలవడానికి, వస్తువులనూ వస్త్రాలనూ కొనడానికి ప్రయాణానికి మేలు. 2, 3 ల్లో వ్యాపార స్పెక్యులేషన్లలో లాభకరమైన పరిస్థితులు కలుగుతవి. సందేహించక వినియోగించుకోండి. 27 అజీర్తి బాధ. 30 అప్తసమాగమం. 3 శుభవార్త.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈ వారంలో 1 సాయంత్రం వరకు అన్నివైపులా గమనించి యుండడం అవసరం. 27, 28 ల్లో మీరు పట్టుదలవహించి ప్రయత్నించినా సాధించకలిగేదేమీ యుండదు. 29, 30, 1 ల్లో ఎటుపోయినా అపశకునాలు కల్గుతవి. కుటుంబ ఆర్థికపరిస్థితులు విశ్రాంతి నివ్వవు. వారాంతంలో ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. క్రమతోకూడిన ప్రయాణం చేయకలుగుతారు. పరిష్కారాలు ఆపండి.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈ వారంలో పరిస్థితులు చాలా ఎగుడుదిగుడుగా యుంటవి. ఉత్సాహంతో కార్యక్రమం ప్రారంభించెదరు. కాని 29 నుండి అడుగడుగునా విఘ్నాలు హెచ్చుతవి. అందువల్ల అపుడలు కలుగుతుంది. 29, 30 ల్లో భోజనశయన సౌఖ్యంయుండదు. కుటుంబంలో సందేహాలు కలుగుతవి. ఆరోగ్యంకూడా సరిగా యుండదు. 1, 2, 3 ల్లో విశ్రాంతి అవసరం. స్పెక్యులేషన్ మరచిపొండి.

**కన్య** (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో 27-28 ల్లో పరిష్కారాలు, కొనుగోలు, విక్రయాలూ, వ్రాతలూ లాభకరం. మీ ఉద్దేశ్యాలను కార్యక్రమంలో యుంచడానికి తగిన అవకాశాలు కలుగుతవి. 29-31, 1 ల్లో ఆప్తులను కలుస్తారు. ప్రయాణం సౌఖ్యప్రదం అవుతుంది. సత్ప్రస్తావనలు ఫలించకలవు. ఆంతరంగిక వ్యక్తిత్వవ్యూహాల్లో ముఖ్య కార్యక్రమం ఆపి వారాంతంలో విశ్రాంతి పొందండి. 27 శుభవార్త.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 28 సాయంత్రంవరకు మీ వృత్తి ఉద్యమపరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. నూతనంగా ఏ వ్యాపారం-వ్యవహారంలోనూ జోక్యం కలిగించుకోకండి. 29-30, 1 ల్లో మీరు తలపెట్టి సాధించలేనిదేమీ యుండదు. శుక్రచలనం మానసికంగా కొంతఉద్రేకానికి మనోబలహీనతకు గురిచేస్తుంది. వారాంతంలో ప్రయాణం లాభకరం. ఆప్తులసహాయంతో స్పెక్యులేషన్లో ఎక్కువలాభం పొందకలుగుతారు. 30 శుభవార్త.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో 1 సాయంత్రం వరకూ మీకు ఎటుపోనూ తోచదు. 27-28 ల్లో వేళకు భోజనశయన సౌఖ్యాలు అమరవు-అవసరమైన ప్రయాణం ఆగిపోతుంది. 29, 30, 1 ల్లో సంఘవ్యవహారాలు విశ్రాంతి నివ్వవు. ఇరుగు పొరుగు పరిస్థితులు మనస్సును చెదరకొట్ట కలవు. వారాంతంలో పరిష్కారాలూ-నూతన వస్తు క్రయ విక్రయాలూ లాభకరం. 2. శుభవార్త.

**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ప్రస్తుతం మీకు ఆర్థికకుటుంబచిక్కులు చాల యున్నై. జాగ్రత్తగా గమనించి పొండి.

ఈ వారంలో 27, 28 ల్లో మాత్రం కార్యక్రమంలో ముఖ్యభాగం ముగించుకొనటానికి అవకాశాలు కలుగుతవి. 29, 30, 1 ల్లో మీనునిశితమైన బుద్ధిని చెదరగొట్టడానికి ప్రతికక్షులు పెద్దప్రయత్నాలు చేస్తారు. దూరంగా యుండండి. వారాంతంలో ఆరోగ్యం బాగా యుండదు. 27 శుభవార్త. 30 అజీర్తిబాధ, అకాల భోజనాలు.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈ వారంలో మీ పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. కాని 29 నుండి విపరీతమైన ఖర్చులు తేస్తవి. ఒక విధంగా మనస్సు నకు కాంతికలుగుతుంది. 30, 1 ల్లో పరిష్కారాలూ వ్రాతలూలాభకరం. 2-3ల్లో ప్రయాణం ఆగిపోతుంది. కాని శ్రేయోభిలాషులను కలుస్తారు. కోర్టు వ్యవహారాలుంటే 29-30 ల్లో రాజీలు పడడం మంచిది.

**కుంభం** (ధనిష్ఠ 3,4పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. 27-28 ల్లో జయప్రదంగా ప్రయాణం ముగించ కలుగుతారు. మీ అంతరాత్మను గమనించి యుండండి. మీకు ఎక్కడా కలగని సహాయం కలుగుతుంది. 29-30-1 ల్లో విశ్రాంతి అవసరం. కుటుంబ ఆర్థిక పరిస్థితులు కొంత అలజడి కలిగించకలవు-వారాంతంలో పరిష్కారాలు ముగించండి.

**మీనం** (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో శుక్రచలనం మీ వ్యాపారాదుల్లో కొంత స్తంభనం కలుగిస్తుంది. 29-30-1 ల్లో తప్ప మీరు ప్రయాణం వ్రాతలూ, ఆర్థిక పరిష్కారాలూ జరుపవద్దు. 27-28 లో కొరగాని ఖర్చులు ఎక్కువ. వారాంతంలో కుటుంబ వ్యవహారాలు మనస్సుకు అలజడి కలిగించకలవు. 30 శుభవార్త. 3 ఇరుగు పొరుగుతో వాగ్వాదం కలహం.

# సభలు-సమావేశాలు

అనంతపురంజిల్లా సోషలిస్టుపార్టీ సానుభూతిపరుల సభ ఈనెల 27 న అనంతపురంలో జరుగును.

పల్నాడుతాలూకా రెడ్డి మహాసభ కాసు బ్రహ్మానందరెడ్డిగారి అధ్యక్షతను నవంబరు 28 న గురజాలలో జరుగును.

రాజోలుతాలూకా కౌలు రైతుమహాసభ నవంబర్ 27 న మల్కిపురంలో రుద్రరాజుగారి అధ్యక్షతను జరుగును.

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గారి స్మారక సభ ఈనెల 30 తే సా. 5 గం నెల్లూరు పురమందిరమున బెజవాడ రామచంద్రారెడ్డి గారి అధ్యక్షతన జరుగును. గొబ్బూరు వెంకటానంద రాఘవరావు, కాశీపట్నం కొంపెల్లయ్యగార్లు ఉపన్యసింతురు. కవికోకిల నాటకప్రదర్శనమున వారిరుపుకి నాటకపాత్ర ప్రదర్శనము జరుగును.

# మదరాసు వార్తలు

## ఉద్యోగవార్తలు

చెన్నపట్నం, నవంబర్ 29: శ్రీ సి. వి. నరసింహన్ ఐ. సి. యస్. గారు తాత్కాలికముగా రెవిన్యూబోర్డు సెక్రటరీగా శ్రీ. పి. యం. జయరాజన్‌గారి బదులు నియమింపబడిరి.

ఎ. యఫ్. మాస్కరెన్ హాస్‌గారు సివిల్ సప్లయి కమిషనరు కార్యదర్శి తాత్కాలికముగా రెవిన్యూబోర్డు అడిషనల్ సెక్రటరీగా నియమింపబడిరి. జనాబ్ గులాం మహమ్మద్‌గారు సివిల్ సప్లయిస్ డిప్యూటీ కమిషనరు మాస్కరెన్ హాస్‌గారి బదులు సివిల్ సప్లయిస్ కార్యదర్శిగా నియమింపబడిరి.

సి. యస్. జాన్‌గారు డిప్యూటీ కలెక్టరు తాత్కాలికముగా సివిల్ సప్లయిస్ డిప్యూటీ కమిషనరుగా నియమింపబడిరి.

కే. సి. మాథ్యూగారు తూర్పుగోదావరి కమర్షియల్ టాక్సు ఆఫీసరు సెలవు నుండి రాగానే అదే ఉద్యోగములో నుందురు.

సి. యం. జాన్‌గారు బాపట్ల వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాలుగా నియమింపబడిరి. శ్రీ టి. తంబు మల్లారెడ్డిగారు మధురలో ఎగ్జిక్యూటివు ఇంజనీరు విజయవాడకు మార్చబడిరి.

### శ్రీ సి. పెరుమాళసామిరెడ్డి

మదరాసు, నవంబరు 25: మదరాసు పరిశ్రమల మంత్రి శ్రీ సి. పెరుమాళసామి రెడ్డిగారు న్యూఢిల్లీనుండి 28 తేదీన విమానంలో మదరాసు చేరెదరు.

మద్రాసు స్వతంత్ర నగర సోషలు సర్వీసు సెంటరునందు తూ. గో. జిల్లా ఆదిఆంధ్ర హైస్కూల కాంగ్రెసుఅధ్యక్షులు డా॥ ఎస్. చెహరాగారు ప్రస్తుత పరిస్థితులనుగూర్చి 28 తేదీన ఉపన్యసించిరి.

దేశీయవైద్య కళాశాలయందు 26 తే సా 5 గ. డా॥ ఎం. విశ్వేశ్వర శాస్త్రిగారు 'పంచభౌతికం' గూర్చి ఉపన్యసించెదరు. ఆయుర్వేదాచార్య డా॥ ఎన్. మాధవమీనన్‌గారు అధ్యక్షతవహించెదరు.

ఆస్ట్రేలియా నుండి హైదరాబాద్ కొరకు 2000 టన్నుల గోధుమలు 24 తే మద్రాసు రేవులో దిగినవి.

ఐనవరంలో గురువారం రాత్రి రెండు పార్టీలవారు కొట్టుకొనగా 13 గురు గాయపడిరి. 4 గురిని పోలీసువారు అరెస్టుచేసి జామీనుపై విడుదల చేసిరి.

# "భక్తరత్న" సరస్వతీ అమ్మాళ్

"పానీయంబులు ద్రావుచున్, కుడుచుచున్, భాషించుచున్,……సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృత స్వాదనాధీనుండై మరచున్ సురారిసుతుడే తద్విశ్వమున్" అని సెలవిచ్చాడు పోతరాజు. భాగవతోత్తముడైన ఆ ప్రహ్లాదుని భక్తిపారవశ్యమును వర్ణిస్తూ బాల్యంలో ప్రహ్లాదచరిత్ర చదువుకున్నప్పుడు ఇవన్నీ చూస్తే ప్రహ్లాదుడు మాలాంటి ఒక మానవుడుకాదనీ అతడు కేవలము ఒక కల్పిత పౌరాణికపాత్ర మాత్రమేననీ ఒక గట్టి అభిప్రాయం మనస్సులో నిల్చిపోయింది.

కాలక్రమేణజీవితంలో ఎన్నో ఘట్టాలు గడిచిపోయాయి. లోకానుభవంకూడా ఇంతోఅంతో అలవడింది. ఆ యినా ప్రహ్లాదుని గురించిన అభిప్రాయంమాత్రం అలాగే చెక్కు చెదరకుండా వుండిపోయింది.

ఇటీవల, కేవలము పూర్వ సుకృతము వల్లనే కావచ్చు—భక్తరత్న బిరుదాంకిత శ్రీమతి సరస్వతీఅమ్మాళ్ దర్శనం చేసి ఆమె సముఖంలో కొంత తడవు కాలక్షేపంచేసే మహదవకాశం లభించింది అతిశయోక్తికాదు.—ఆమెదర్శన ఫలితం నాకు ప్రహ్లాదునిమీదగల అభిప్రాయాన్ని మార్చివైచినది.

శ్రీమతి జన్మస్థానము కోయంబత్తూరు జిల్లాలోని పొల్లాచి. ఆమె తండ్రిగారు గణపతిశాస్త్రిగారు అక్కడ సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో పనిచేస్తుండేవారు. గణపతిశాస్త్రిగారు గొప్ప విద్వాంసుడు. వేదాలను ఉపనిషత్తులను మథించి విజ్ఞానార్జన చేసినవాడు. సరస్వతీఅమ్మాళ్‌కు పితృ మూర్తియే ప్రథమగురువుగా లభించుట ఆమె అదృష్టము.

ఈమెకు 12వ ఏట తొలిసారి భగవత్సేవాకాంక్ష జనించినది. అప్పుడేఆమె శివకేశవ సమత్వాన్ని అర్థం చేసుకున్నేనిమిత్తం ఉమాపతి నామధేయంతోశివుని, కోదండ రామస్వామి నామధేయంతో కేశవుని ఆరాధించడం ఆరంభించినది.

18వఏట శ్రీమతి తిరుపతియాత్ర తొలిసారి చేసినది. అది ఆమెజీవితంలో ఒక ప్రధానఘట్టం. ఆలయంలో ప్రవేశించిన వెంటనే ధ్వజస్తంభములో ఆమెకు స్వామి పూర్ణదర్శనం కల్గించాడు.

22-వ ఏట, తొలిసారిగా గర్భవతి యైనపుడు, సరస్వతీ అమ్మాళ్ తిరుపతికి రెండవసారి యాత్రచేసినది. ఈసారి భగవానుడు దర్శనమిచ్చుటేకాక "నీకు కావలసినది ప్రపంచమా, పాదారవిందమా"అని ప్రశ్నించాడు… "అజన్మమూ నీ నామ సంకీర్తనం చేయగల ఒక్కబిడ్డను మాత్రం ప్రసాదించవలసినది" అని ఆమె శ్రీనివాసుని అర్థించింది. స్వామి ప్రసాదించినాడు.

సరస్వతీ అమ్మాళ్ జీవితంలో పాండురంగడు ఆమె కుమారుడైద్వారా ప్రవేశించాడు. ఏడేండ్ల బాలిక ఒకనాడు తనతల్లి దగ్గరకు ఒక విచిత్రమైన కోరికకోరడానికి వచ్చింది. "అమ్మా! నేను ప్రతి శుక్రవారమూ, శనివారమూ శ్రీ పాండురంగని సంకీర్తన చేసుకుంటాను, అనుజ్ఞ యివ్వవలసిందని.

ఒకవిధముగా కుమార్తె తల్లి గారికి మార్గదర్శకురాలైంది. పాండురంగనిభక్తి అధికము కాగా 1943 లో శ్రీమతి పండరీపురమునకు తొలియాత్ర చేసినది. అప్పుడే నిత్యమూ తన సన్నిధిలో వుండేఅవకాశం తనకు కల్పించవలసిందని "భక్తరత్న" స్వామిని అర్థించింది. స్వామి కరుగలేదు. రెండవ యాత్రకూడ అట్లే అయినది. మూడవతూరికి స్వామి మనస్సు కరిగి సమ్మతించారు. ఆప్రకారం "భక్తరత్న" 1946 లో పాండురంగనికి తన ప్రాకారంలోనే ఒక కోవెల నిర్మింపచేసినది. మరల పండరీపురము వెళ్లి స్వామి ఆజ్ఞానుసారం అక్కడి ధర్మకర్తబహూకరించిన స్వామి ప్రతిని మేళతాళాదులలో, నామ సంకీర్తనముతో మద్రాసు తీసుకువచ్చి 1947 మే 29-వ తేదీన త్యాగరాయనగరులో ప్రతిష్ఠితుని చేశారు. మూర్తి తేజోమయమైనది. అచ్చముగా పండరీపురములోని విగ్రహమునకు ప్రతి.

శ్రీమతి "భక్తరత్న" భక్తి పారవశ్యంలో మునిగి రోజులతరబడి ఆహార నిద్రాదులు విడనాడి భగవన్నామ సంకీర్తనం చేస్తూ గడపినది—ఇప్పటికీ గడుపుతుంది. ఆమెకు ఆరు ప్రాంతీయభాషలలో ప్రవేశం కలదు. వేదాంతవిచారము ఆమెకు ప్రధాన కాలక్షేపం. ఆమె సముఖములో ఉన్న కొలదికాలము భౌతిక చింత నాకు కల్గనే లేదు. ఆధ్యాత్మిక పిపాస నాలో పొడచూపింది. భక్తరత్న పరిచయం జీవయాత్రలో ఇంత ఆలస్యముగా కల్గినందులకు నావిధిని వేనవేల సార్లు నిందించుకున్నాను. 'ఒకరు'

# గుంటూరుజిల్లా కలెక్టరు పదవి మార్పు

మద్రాసు, నవంబరు 26: గుంటూరు జిల్లా కలెక్టరు, జిల్లా మాజిస్ట్రేటు అయిన టి. ప్రభాకరరావు నాయుడుగారు కె. ఉన్నితన్ (ఐ. సి. ఎస్.) గారి స్థానే స్థానిక సంస్థల, మునిసిపాలిటీల ఇన్స్పెక్టరుగా నియమింపబడ్డారు. డిప్యూటీ కలెక్టరు ఎస్. కనకసుందరంగారు ప్రభాకరరావు నాయుడుగారి స్థానంలో నియమింపబడ్డారు.

## WANTED

**A**N IDEAL AND POPULAR GENERAL Insurance Society of Madras transacting Fire and Motor Insurance (on Mutual Basis (i. e.) all the profits going back only to those that insure) invites applications from real workers capable of introducing substantial business to represent as Chief Agents on good commission or salary. Contact immediately Box. No. 5/225 C/o Andhra Patrika, Madras.

## అమ్మకము

**హోఫమన్ ఎసి/డిసి & బ్యాటరీ** రేడియోలు. ఖరీదు బ్యాటరీతో 200/-లు నికరము. స్టాకు మితంగా వున్నది. వివరములకు: అరవింద్ రేడియో కంపెనీ, 20 బ్రాడీస్ రోడు, మద్రాసు-4.

## కావలెను

**ప్రతిరోజు 10 టన్నుల** (మార్చి 1950) స్ట్రాబోర్డులు, గ్రే బోర్డులు, మాన్లెక్సు బోర్డులు తయారు చేసే మద్రాసులోని ప్లాంటుకు సోల్ యేజంట్లు కావలెను. ఇదివరకే ఈ వ్యాపారంలో అనుభవం వున్న సమర్థులగువారు దరఖాస్తులు పంపవలెను.

వివరములకు: DP C/o G. P. O. Box No. 585, Bombay.

కాశ్మీర్
అన్నిదగ్గులకు అమోఘమైనది
గిరిజా & కో, రాజమండ్రి

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

### మద్రాసు-రాయచూరు సెక్షన్ మీద బండ్ల టైమింగులలో మార్పు

1-12-1949 మొదలు నెం. 21, 22, 26, 35, 36 బండ్ల టైమింగులు దిగువ తెలిపిన వివరముల ప్రకారము కొద్దిగా మార్చబడును.

దిగువకు చదవవలెను ↓ | ఎగువకు చదవవలెను ↑

నం. 21 మద్రాసు-బొంబే ఎక్స్‌ప్రెస్. | నం. 22 (బొంబే-మద్రాసు ఎక్స్‌ప్రెస్.)

| నం. 21 | స్టేషను | నం. 22 |
|---|---|---|
| | మద్రాసు నందలూరు మధ్య మార్పులేదు | (తరువాత మార్పులేదు) |
| ఉ. 11-59 రాక / 12-11 పోక | నందలూరు | పోక మ. 2-19 (ఇప్పటివలె) / రాక మ. 2-5 |
| మ. 1-4 రాక / 1-24 పోక | కడప | పోక మ. 12-49 / రాక మ. 12-29 |
| మ. 2-10 పోక | కమలాపురం | పోక మ. 12-9 |
| మ. 2-30 ,, | యర్రగుంట్ల | పోక ఉ. 11-51 |
| మ. 2-49 ,, | ముద్దనూరు | పోక ఉ. 11-35 |
| సా. 3-41 ,, | కొండాపురం | పోక ఉ. 11-11 |
| సా. 4-9 ,, | తాడిపత్రి | పోక ఉ. 10-37 |
| సా. 4-35 ,, | రాయలచెరువు | పోక ఉ. 10-13 |
| సా. 5-2 రాక / 5-22 పోక | గుత్తి | పోక ఉ. 9-41 / రాక ఉ. 9-21 |
| సా. 5-51 రాక (ఇప్పటి వలెనే. తరువాత మార్పులేదు) | గుంతకల్ | పోక ఉ. 8-55 / రాక ఉ. 8-31 (ఇప్పటివలెనే) |

### నం. 26 రాయచూరు-మద్రాసు ప్యాసెంజరు

| స్టేషను | సమయం |
|---|---|
| నందలూరు | రాక ఉ. 7-24 |
| | పోక ఉ. 7-54 (ఇప్పటివలె) |
| రాజంపేట | ,, ,, 8-17 |
| పుల్లంపేట | ,, ,, 8-30 |
| రెడ్డిపల్లి | ,, ,, 8-44 |
| ఉరంపాడు | ,, ,, 9-2 |
| అనంతరాజుపేట | ,, ,, 9-14 |
| కోడూరు | ,, ,, 9-40 (ఇప్పటివలె) (తరువాత మార్పులేదు) |

### నం. 36 గుత్తి-రేణిగుంట మిక్స్‌డ్

| స్టేషను | సమయం |
|---|---|
| (ముద్దనూరు వరకు మార్పులేదు | పోక సా. 2-11) |
| కలమల్ల | ,, ,, 2-32 |
| యర్రగుంట్ల | ,, ,, 2-48 |
| యర్రగుడిపాడు | ,, ,, 3-4 |
| కమలాపురం | ,, ,, 3-47 (ఇప్పటివలెనే) (తరువాత మార్పులేదు) |

### నం. 35 రేణిగుంట-గుత్తి మిక్స్‌డ్

| స్టేషను | సమయం |
|---|---|
| రేణిగుంట | పోక ఉ. 6-40 |
| నందలూరు | రాక ఉ. 9-40 / పోక ఉ. 10-15 |
| కడప | రాక ఉ. 11-40 / పోక మ. 12-5 |
| గుత్తి | రాక సా. 6-35 |

మధ్య స్టేషనుల టైమింగుల కొరకు దయచేసి స్టేషనులవద్ద విచారించండి.

ఆంధ్రపత్రిక

ఆదివారం నవంబరు 27, 1949

సారస్వతానుబంధము

# తక్షశిలా నగర చారిత్రక పరిణామం

## ప్రాచీనభారతపు ఏథెన్సు

శతాబ్దాలనాటిమాట. మధురమైన చరిత్రాంశాలను మననం చేసుకొంటే జ్ఞప్తికివస్తుంది. రెండు అపారసేనావాహినులు ముఖాముఖినిల్చున్నాయి, పోరాటానికి రెండుపక్షాల చతురంగబలాలూ దీకొనడానికి సిద్ధంగా ముందడుగు వేస్తున్నాయి. ఎక్కడచూసినా నిశ్చలగంభీరత్వం తాండవిస్తోంది. ఇరుకక్షులలోని సైనికులూ తమ తమ యజమానుల అనుమతిని సూచించే శంఖ నాదానికి చెవులు రిక్కించి నిరీక్షిస్తున్నారు.

అటువంటి సమయంలో వీక్షించినంతనే పూజ్యుడని తెలిసికోదగిన యోగిపుంగవు డొకడు దీకొంటున్న రెండుసేనల మధ్యనూ అవతరించి, సుదీర్ఘములైన తన బాహుద్వయాన్ని విస్తరించి, ఆజ్ఞాపూర్వకమైన గంభీరస్వరంతో 'ఆగండి' అని అడ్డుపడ్డాడు.

'భారత్ కీ జై!' 'బహుబలికీ జై!' అని కర్ణపుటాల్ని బ్రద్దలుచేసే జయనినాదాలు రెండు సేనాసమూహాలుండీ ఒక్కసారి విజృంభించి ఆగిపోయినై! లక్షలాదివీరుల నేత్రాలన్నీ ఆ క్షణాన యిరుసైన్యాలకూ మధ్యనున్న నూతనవ్యక్తిపై కేంద్రీకరింపబడ్డాయి. భరతుడూ, బలీ, తమ తమ ఉన్నతాశ్వాలనుండి నేలకురికి యోగీశ్వరుని ధూళిధూసరితపాదాల్ని స్పృశించి పూజించేవరకూ సేనలలో నలుదెసలా ఆవరించిన విస్మయము సడలలేదు.

'అయితే, మీరుభయులూ హేయమైనయుద్ధాన్ని ప్రారంభించి, రక్తపాతం కలుగచెయ్యడానికి సర్వసన్నద్ధులై యున్నారన్నమాట. మిమ్మల్ని పనికి ప్రేరేపించిన కారణాల్ని దయచేసి విశదీకరించగలరా?' వినమ్రతగానే ప్రశ్నించేడు యోగి.

'నా గౌరవాన్ని కాపాడుకొనే నిమిత్తం, స్వామీ!' అంజలిఘటించి అతివినయంగా జవాబిచ్చాడు భరతుడు. 'బలి నాయాజ్ఞను ఉల్లంఘించి రాజమర్యాదకే భంగంకలిగించేడు.'

'నీ తుచ్ఛమైన ఆజ్ఞలకు నేనెందుకు బద్ధుణ్ణికావాలి? నీవుగీచినగీటు దాటకపోవడానికి, నేను నీచేతులో కీలుబొమ్మను కాను. నీవు నాకగ్రజుడవైతే కావచ్చు. కాని, నాకూ మానమర్యాదలూ, మానవసహజమైన వాంఛలూ ఉన్నాయి.' పౌరుషంగా జవాబిచ్చేడు, బలి.

'అయితే మిమ్మల్నిద్దరినీ రెచ్చగొట్టినది వ్యక్తిగత భేదాభిప్రాయాలేకాని, రాజ్యానికి సంబంధించిన విషయమేదీకాదు. ఇది మీ ఉభయుల వ్యక్తిత్వాలకూ సంబంధించిన సమస్యగనుక, అమాయకులైన ప్రజలకు సంబంధంలేకుండా, మీరిద్దరే మీ మీ బాహుబలాల్తో ఎందుకు పరిష్కరించుకోకూడదు?'

భరతుడూ, బలీ - ఒకరినొకరు చూచుకొని మునిప్రస్తావించిన సూచనకామోదించారు. వెంటనే ద్వంద్వయుద్ధానికి సర్వసన్నాహాలూ చేయబడ్డాయి. ఈ సంఘటనకు సంభ్రమాశ్చర్యాలు సముపాళ్ళలో మిళితంచేసుకొని కలవరపడుతూన్న సైనికులు, తమ దూసినఖడ్గాలను ఒరల్లో భద్రపరచి, పరిధ్యాకొవ యుద్ధభూమిని పరివేష్టించి విస్తుపోయి చూడసాగారు.

రణదుందుభులు మ్రోగాయి. ద్వంద్వయుద్ధానికి తలపడి వాలిసుగ్రీవుల్లాపోరాడుతున్న సోదరుల్లో జయలక్ష్మి ఎవర్ని వరిస్తుందో మొదట్లో చెప్పవశంకాదు. ఒకసారి భరతుడు విజృంభిస్తున్నాడు. మరొకసారి బలిది పైచేయిఅవుతూంది. చివరకు బలితొడచరచి, భరతుణ్ణి రెండు చేతులా మీదికెత్తి నేలకువిసరి కొట్టేడు! సంతోషంతో ఉక్కిరిబిక్కిరయిన బలి పక్షీయుల తలపాగలు ఒక్కక్షణంమీది కెగిరి గాలిలో నాట్యం చేశాయి! జేతదురహంకారం విచిత్రంగా మారిపోయింది! ప్రేక్షకులు గమనించే లోగానే బలి, వీగిపోయిన భరతుణ్ణి లేవనెత్తి, భ్రాతృవాత్సల్యంతో అక్కున జేర్చుకున్నాడు. ప్రజల హర్షధ్వనుల మధ్య రాజధానీ నగర సింహాసనాన్ని అగ్రజునికి అంకితం చేసేడు. ఆ రాజధానే చరిత్రాత్మకమైన "తక్షశిల"

అపూర్వమైన తమ ప్రభువుల యీ సఖ్యతను చూసిన ప్రజలు సంతోషంతో ఊగిసలాడి సంబరాలు చేసుకున్నారు. రథగజ తురగపదాతివర్గాలతో కూడిన ఊరేగింపు కన్నుల పండువైంది. దంతావళంపై సమర్చిన ఉన్నతాసనం మీద ఆసీనులై బలి భరతులిరువురూ, వందిమాగధులు కైవారాలు చేయగా, పురోహితుల ఆశీర్వాదాలను పొందుతూ, శంఖారావాలతో, మంగళధ్వనుల మధ్య రాజధాని తక్షశిలకు పయనమయేరు. ఆకారణాన్ని పురస్కరించుకొని, తక్షశిలలో ఒక వారంరోజులు ఉత్సవాలు జరిగాయి.

ఈ సంఘటన చాలా కాలం తర్వాత అనగా క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో, బుద్ధదేవుని సూక్తులు మెల్లిగా మన్ననలందుకొని, ఆదరింపబడుతూన్న సమయంలో, ఒక నాడు ప్రాతఃకాలాన్నే లొట్టియ ఒకటి తక్షశిల పశ్చిమ ద్వారం ముందు నిలిచింది. ద్వారపాలకులు ద్వారం తెరచి, ఆ జంతువును లోనికి ప్రవేశ

### దేవదత్త

పెట్టేరు. హిందూమత ధర్మాలనూ వైద్యవిద్యనూ అభ్యసించడానికి, ఆ ఒంటెపై వచ్చిన చీనాదేశపు బాటసారిని నగరవాసులు మొదట ఉద్వేగంతో చూశారు. తరువాత ఉత్సాహంతో ఆహ్వానించేరు.

ఆ కాలంలో తక్షశిల విశ్వవిద్యాలయము వివిధ ప్రదేశాల నుండి వచ్చిన యావన్మందివిద్యార్థులకూ ఆహ్వానమిచ్చేది. ఆ విశ్వవిద్యాలయంలో అప్పటి (Alumni) మానవుల సంఖ్యరమారమి పది వేలు! విద్యార్థుల ఉచితమైన వసతిగృహములూ, ఆహారాది విషయము లన్నిటిలో అధికారులమితమైన శ్రద్ధ చూపేవారు.

అంతకు పూర్వ మెన్నడూ, హిందూదేశపు విద్యాసంస్థను చూడని హూన్‌సాన్ అనే ఆ చీనాదేశపు విద్యార్థి నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉండే ఆ విద్యాలయాన్ని చూసి విస్తుపోయాడంటే అతిశయోక్తి కాదు. పట్టణములోని కట్టడముల రామణీయకత, కథలుగా చెప్పుకోడానికి సరిపోయ్యే భాగ్యసంపద, అపారమైన జనసంఖ్యలతో అలరారే పట్టణం ఎవర్ని చకితుల్ని చెయ్యదు. పాడిపంటలకు కరువు లేదు. నగరవాసులు విలువైన దుస్తులు ధరించి తిరిగేవారు. వాణిజ్యం అతిచురుకుగా సాగేది........కాని వివాహం కాని బీదపిల్లను బహిరంగంగా వేలం వేసే సన్నివేశములు అతన్ని కలచివైచాయి. మృతకళేబరాలు గ్రద్దలపాలు కావడం చూసి కటకట పడ్డాడు.

కొన్ని సంవత్సరముల అనంతరం, గుర్రపుడెక్కల చప్పుళ్ళచేత, రథచక్రాల శబ్దాలవలన తక్షశిల నగరవాసు లొకనాడు ప్రాతఃకాలాన్నే మేల్కొలుపబడ్డారు. నగరం ముట్టడింపబడిన సూచనలు కన్పించేయి. ఆ కాలములో తక్షశిల పాలకుడగు అంభికి తూర్పుదిశను పురుషోత్తముడూ, పశ్చిమాన అభిసారుడూ ప్రక్కలోని బల్లెములై యుండేవారు. వారిరువురిలో నెవరో యొకరు పట్టణముపై దండు విడిసి యుండవచ్చు.

కాని, చక్రవర్తి, అంభి నాయకత్వము క్రిందనే నగరము నాక్రమించిన యవనసేనలను చూచినప్పుడు ప్రజల భయము ఆశ్చర్యంక్రింద మారింది. పురుషోత్తముని జయించుటకు అంభి, యవనచక్రవర్తియైన అలగ్జాండరుకు అమ్ముడుపోయాడనే వార్త అంటురోగంలా వ్యాపించింది. సోదర రాజునకు ప్రతికూలంగా పరదేశీయునితో కలసిన అంభి చర్యను ధీమంతులు బహిరంగంగా ఖండించారు. కాని ప్రబలిన అశాంతిని యవన సేనలు వేగంగానే అణచివేశాయి!

పురుషోత్తముని విషయంలో అలగ్జాండరుకు అంభియొక్క విభీషణ సహాయం లభించింది. చరిత్రకారులు యీ విషయంలో కళ్లుమూసుకొంటే మోసపోవచ్చును. కాని పురుషోత్తముని ఓటమి ముఖ్యంగా తనచేత కానితనంవల్ల కాకపోయినా, సోదర రాజగు అంభిద్రోహం వల్ల కావచ్చు.

లొంగిపోయిన శత్రువుతో అలగ్జాండరు రాజకీయమైన దూరదృష్టితో మైత్రి చేసుకొన్నాడు. అంభి తన ద్రోహబుద్ధికి బహుమతిగా తక్షశిలను పొందేడు.

అలెగ్జాండరు సముపార్జించుకొన్న ప్రఖ్యాతి అతనితోనే అంతమైపోయింది. బాబిలోనియాలో అలగ్జాండరు చనిపోగానే యవనసేనలు సింధునదీ పరిసరాల్లో నుండి చంద్రగుప్తమౌర్యునిచేత తరిమివేయబడ్డాయి. తక్షశిలకోట బురుజులపై మౌర్య పతాకం రెక్కలు విప్పింది. హిందూరాజుల శక్తిసామర్థ్యాలు మరొకసారి పడగలెత్తాయి. చంద్రగుప్తునికి, కాక తాళీయంగా రాజ్యాంగతంత్ర నిపుణుడైన చాణక్యుని మంత్రిత్వం లభించడం అతని అదృష్టమనే చెప్పాలి.

చాణక్యుడు, పరరాజులచే తక్షశిల ముట్టడింపనున్నదని పసికట్టేడు. స్వరాజ్య రక్షణకు నిరంకుశత్వం చాలా అవసరమైనదని, దానికొరకు సర్వ విధాలాపాటుపడు ఒక అజేయశక్తిని ఉపదల్చుకొన్నాడు. చాణక్యుని దీక్షవల్ల చంద్రగుప్తునికి రాజ్యవిస్తరణము చాలా సులువైంది. తత్ఫలితంగా రెండుసంవత్సరాల్లోనే మౌర్యరాజ్యము సరిహద్దు హిందూకుష్ పర్వతాలవరకూ పెరిగింది. యవనులు రాజ్యంచేసిన చిహ్నాలు దేశంనుండి శాశ్వతంగా తుడిచివేయబడ్డాయి! తరువాత ఒక దశాబ్దం గడచిన అనంతరం సెల్యూకస్ నికటర్ అనే యవననాయకుడు, అలగ్జాండరుచేత జయింపబడిన భాగాన్నంతా, మరల తనచేతిలోనికి తెచ్చుకో ప్రయత్నించాడు. కాని, గర్వభంగమై చంద్రగుప్తునితో సంధిచేసుకొనవలసి వచ్చింది. స్వతంత్రలేకుండా మాచే యీపరిపాలనా పద్ధతులకు ప్రజలు తట్టుకోలేక బిందుసారుడు సింహాసనాన్నాక్రమించి తక్షణం తిరుగుబాటు చేసేరు.

అమెరికా పర్యటన ముగించుకొని భారతదేశం తిరిగివచ్చిన నెహ్రూ ప్రధానికి ఢిల్లీ ప్రజలు స్వాగతమిచ్చారు. ఆ సమావేశంలో ప్రసంగించుచున్న నెహ్రూ. రాష్ట్రపతి పట్టాభి చేరువను కూర్చునివున్నారు.

రాజ్యంలో అరాజకం ప్రబలింది. నగరంలో భీతిస్థావరమైంది, ఇళ్లు తగులబెట్టిన నేరాలసంఖ్య రోజురోజుకూ పెరిగింది. రాజప్రాసాదాలూ, కచేరీలు నేలమట్టం చెయ్యబడ్డాయి. నిరాకరణహత్యలు అంతులేకుండా జరిగేయి, విప్లవజ్వాలలను చల్లార్చడానికి మహాసైన్యంతో వెళ్ళిన బిందుసారుని జ్యేష్ఠపుత్రుడు, 'సుషీమ్' భంగపడి తిరిగివచ్చాడు. చివరకు తక్షశిలలో రాజప్రతినిధిగా ఉండే అశోకుడు విప్లవకారులను లోబరచుకొని మౌర్య రాజ్యసింహాసనాన్ని విప్లవజ్వాలలకు గురికాకుండా కాపాడ గలిగేడు. ఇతడే హిందూదేశంలో బౌద్ధమత ప్రచారానికి పునాది రాయివేసిన మొదటి రాజు. మగధరాజ్యంలో తక్షశిల కూడా ఒకముఖ్య నగరమైంది. రాజవంశంలోని వారిక్కడనే ప్రధాన భూమికలను నిర్వహించేవారు. అశోకుడు స్థాపించిన బౌద్ధస్థూపాలలో చాలా తక్షశిలలోనే వెలశాయి. పేరెక్కిన కుణాలుని స్తూపంయిక్కడిదే.

కుణాలుడు సౌందర్యమూర్తి, ఇతడు చక్రవర్తియైన అశోకుని కుమారుడు. గంధర్వులను సహితమూ సమ్మోహితులను చెయ్యగలిగే సంగీతము, దానికి తగిన కంఠమాధుర్యమూ యితనిలోని ప్రత్యేకాకర్షణలు. అశోకుని చిన్నరాణి తిష్యరక్షిత యీతని సౌందర్యానికి మురిసిపోయింది. అతనిని వలచి వలపించుకొందామనుకొంది. తన యుక్తాయుక్తాలను మరచింది. పుత్రుడైన కుణాలుని చేత మరపింప ప్రయత్నించింది. కాని కుణాలుడీ తుచ్ఛపుపనికి తలఒగ్గలేదు. దెబ్బతిన్నపాము లా పగబట్టింది, రాణి. ఆమెలో కుణాలుని నాశనం చూడాలనే నీచపుకాంక్ష అంకురించింది, ఆక్రోశంలోనే అతనిని తక్షశిలకు రాజప్రతినిధిగా పంపివేసింది.

తరువాత తక్షశిలలోనుండే సేనాధిపతికి చక్రవర్తి పేరున రాజముద్రవేసి, తిష్యరక్షిత ఆజ్ఞాపత్రం పంపించింది. కుణాలుని కనుగ్రుడ్లను తక్షణమే పీకివేయవలసిందనీ, కాని యడల అతని క్రూరదృక్కులు ఏ స్త్రీపైనైనా వ్యాపింపబడవచ్చుననీ ఆ యాజ్ఞాపత్రపుసారం. యువరాజు కనుగ్రుడ్లను బలవంతాన పెరికివైచి అతని అరచేతులలో నుంచినపుడు, తక్షశిల ఒక అపూర్వ దుఃఖానుభూతిని పొందింది.

యువరాజు కొన్ని సంవత్సరాలు దిక్కులేని పక్షిలాగా తిరిగి చివరకు మగధను చేరుకొన్నారు. జరిగినఘోరకృత్యం చక్రవర్తికి తెలిసి మండిపడ్డాడేకాని, క్రూరురాలైన భార్యను శిక్షించలేకపోయాడు. ఆ క్రూరకృత్యం జరిగినచోట కుణాలుని పేరు చిరకాలం నిలిచేలాగా బ్రహ్మాండమైన స్తూపాన్నొకటి మాత్రం నిర్మింపగలిగేడు. ఒకని పేరున స్తూపాన్ని ప్రతిష్ఠ చేయుటంలో ఆవ్యక్తి నమితంగా గౌరవించినట్లు భావించేవారు బౌద్ధులు. కుణాలుని స్తూపాన్ని నిర్మించుటకు వేలకొలది నేర్పరులైన పనివారు రాత్రిందివాలు పనిచేశారు. ఈ స్థలానికి విచ్చేసి, యీ స్తూపానికి మ్రొక్కిన అంధులకు బుద్ధదేవుని కృపవలన దృష్టి కలిగినట్లు అనుశ్రుతంగా చెప్పబడుచ్చేకథల నిప్పటికీ మనం వింటూనే వున్నాం.

అశోకుని మరణానంతరము ఆకలిగొన్న నక్కల్లాగా మూకుమూకలుగా వచ్చి పరదేశీయులు తక్షశిల నాక్రమించుకొన్నారు. ఈ విశాల సామ్రాజ్యానికి ఏనాడో యవనుల దృష్టిదోషం తగిలింది. సెల్యూకస్ కాలంలో తాము పొందిన అవమానాన్ని పురస్కరించుకొని వారిలో రగుల్కొన్న విద్వేషాగ్ని యింకా ఆరిపోలేదు. దినదినమూ శక్తి తగ్గి క్షీణిస్తూన్న తక్షశిలను, పరిసర సామంతరాజ్యాలనూ, యవనులు డిమిట్రియస్ నాయకత్వం క్రింద సులువుగానే లోబరచుకొన్నారు. ప్రసిద్ధమైన 'హారో' లోయ కళాపిపాసులైన వీరి నాకర్షించింది. తన్మూలకంగా యీ లోయలో వీరిచే తృప్తినివసానికి చిహ్నాలెన్నో వెలశాయి. వీరి కాలంలోనే రాజనగరు తక్షశిలనుండి సిర్కాప్‌కు మార్చబడింది. ఈయవనులు మరల ఒకశతాబ్దం కంటె యెక్కువ రాజ్యం చేయలేదు. వీరితరువాత సిదియనులూ, కుషానులూ రాజ్యాన్నాక్రమించుకొన్నారు.

క్రీ. వె. అయిదవశతాబ్దంలో తక్షశిల పూర్తిగా నాశనం చెయ్యబడింది. గుంపులుగుంపులుగావచ్చి దేశాన్నాక్రమించుకొన్న హూణులు పశువులకంటె నీచంగా ప్రవర్తించారు. మారణాయుధాలతో విజృంభించేవారు. ఇళ్లు తగులబెట్టేరు. స్తూపాలనూ, రాజభవనాలనూ నేలమట్టం చేశారు. గుప్తులకాలంలో నెలకొల్పబడ్డ శోభ వీరి పశుత్వానికి బలియైంది. సామ్రాజ్యశోభపతనమైంది. తక్షశిల ఒకనాడనుభవించిన ఔన్నత్యం యీనాడు శిథిలమైంది. ఒకనాడుత్కృష్టమైనకళా సంపదతో వెలసిన 'హారో లోయ' దయ్యాలకొంప లాగా మారిపోయింది! హూణుల పైశాచకృత్యాలకు బలియై, శిథిలాలుగా మిగిలినపట్టణాలను, హిందూదేశానికివచ్చిన చీనాదేశపు బాటసారి, హుయాన్‌త్సాంగ్ చూచి చెప్పలేని వ్యాకులత పొందేడు. శిథిలాలలోనుండి తొంగిచూస్తే పూర్వౌన్నత్యపు చిహ్నాలనుచూచి కంటనీరు పెట్టుకొన్నాడు! భయంకరమైన భూకంపాలకు సహితం పట్టణమంతగా పాడైవుండదేమో! పూర్వము చక్రవర్తులు నివసించేభవనాల్లో గబ్బిలాలు స్థిరనివాస మేర్పరచుకొన్నాయి! నగర రాజౌన్నత్యం ఒక స్వప్నకథయై నిలిచింది. తక్షశిలలో శిలలు మాత్రమే మిగిలాయి!

అనువాదం:

శ్రీ వి. వి. సూర్యనారాయణ.

లడక్‌లోని స్పటక్ ప్రధాన బౌద్ధాచార్యులు (మధ్యనున్నవారు) చైనా, టిబెట్, సింకియాంగ్‌లలో వచ్చిన పరిణామములవల్ల, కాశ్మీర్ రక్షణలను బలపరచాలని ఢిల్లీలో ప్రచారం చేస్తున్నారు.

కోదండ రామస్వామి ఆలయం తిరుపతి

జర్మన్ కెమేరా

యుద్ధానంతరం దిగుమతి చేయడం యిదే మొదటిసారి. ప్రారంభకులు గూడ యీ కెమేరాతో పెద్దసైజు 6×6 ఫోటోలు తీయవచ్చును. ఖరీదు రు 15-0-0. పోస్టేజి రు 1-8-0 అధికం. 12 ఫోటోలకు ఫిలిం ప్రతి కెమేరాతో ఉచితంగా యివ్వబడును. PARKER WATCH Co.. 166, Harrison Road, Calcutta.

ఫాలసుగంధిలేహ్యం

వవామేహములు, మేహపొడలు, మచ్చలు, కుడుపులు చర్మవ్యాధులు, కుష్ఠు, మలబద్ధము, కీళ్లనొప్పులు మొదలగు వ్యాధులను ఖండించుటలో అద్భుతమైనది. 2 తప్పీలుబాలును. 20తులముల డబ్బి రు. 2-0-0 పోస్టేజి ప్రత్యేకం.

పి. కె. ఎ. అండ్ కంపెనీ,
ఆయుర్వేదసమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా.
బ్రాంచి: 7, సీనుమొదలివీధి, మదరాసు.

అగ్నిబాణ్ (కడుపు నొప్పికి టానిక్ ఔషధు) ఇది ఆమ్లము, అజీర్తి, వాతము, గుండెమంట, ఆకలి లేకపోవుట, నిద్రలేమి, శూలనొప్పులు, ఉదరసంబంధమైన వ్రణములు, మున్నగువాటికి అద్భుతమైన చికిత్స 100% గుణమిచ్చుటకు గ్యారంటీ ఖరీదు బుడ్డి రు 3-4. వి. పి. పి. అ. 14 అ. 3 బుడ్లు రు 9/- వి. పి. పి. రు 1-8.

అతిమూత్రవ్యాధి "సోమమహంతక్" అతిమూత్ర వ్యాధికి రామబాణము. దీనిని పదిరోజులు వాడితే అద్భుతమైన గుణము కనబడును. అతిమూత్ర వ్యాధి పీడితులకు "సోమ-మహంతక్" వరప్రసాదము. ఖరీదు రు 5-8 వి. పి. పి. అ. 14 అ. జాబులు యింగ్లీషులో వ్రాయవలెను.

BAIDYANATH AYURVEDASHRAM,
Prop. KJ-M. BHATTACHARYA (A. P.)
120/1/1, Upper Circular Road, Calcutta.

గనోక్వీన్
అన్నిసెగలకు గంటలలోగుణము
ఈశ్వర ఫార్మశీ రాజమండ్రి

గోల్డ్ వింగ్
వేవర్లీ రెడ్ ఇంక్
హిందూ, వేవర్లీ పెన్నుల ఉత్పత్తిదారులచే తయారు చేయబడినవి.
GOLD WING
WAVERLEY RED INK
MACNIVEN & CAMERON LTD.
Waverley Pen Works
BIRMINGHAM · ENGLAND

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు:
ఓరియంటల్ మర్కెంటైల్ ఏజన్సీ,
మద్రాసు.

A SPW Product
MILK OF MAGNESIA
EXCELLENT ANTACID AND MILD LAXATIVE
STANDARD
SM-1

## లండన్ క్రొత్త ప్రదర్శనశాల

థేమ్సునదీతీరాన నిర్మింపబడుతున్న ఈ శాశ్వత ప్రదర్శనశాలకు బ్రిటిష్ ప్రధాని అట్లీ శంకుస్థాపన చేస్తున్నారు. 1951 బ్రిటిష్ జాతీయమహోత్సవాలనాటికి పూర్తిచేస్తారు.

# రాజరాజు బహుమతి

రాజరాజు చోళదేశానికి రాజు. ఆ రాజుకు చాలాకాలంవరకు పిల్లలు లేక ముసలితనంలో ఒక ఆడపిల్ల కల్గింది. ఆ పిల్లకు సుందరి అనే పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచుతూ వచ్చారు. పేరుకు తగ్గట్టుగా సుందరి చక్కనిచుక్క. ఆమె వయస్సుతో చక్కదనం వృద్ధిపొందింది. పెండ్లి ఈడువచ్చే సరికల్లా అప్సరసలాగా తయారయింది. రాజరాజు సుందరికి పెళ్ళిచేయా లనుకున్నాడు. సుందరికి తగినవాడు ఎవరా అని ఆలోచించగా తనకు తెలిసినంతలో అన్నివిధాలా సుందరికి తగినవాడు పాండ్యరాజు కొడుకని తేలింది. కానీ పాండ్యరాజుకూ, రాజరాజుకూ గర్భవైరం. అటువంటి సమయంలో వివాహ విషయాన్ని గురించి సంప్రదించటానికి వీలు కల్గదని అనుకున్నాడు. ఆ సంబంధం కాదని నిర్ధారణ చేసుకున్నాడు.

రాజరాజు ఒకరోజు తనఉద్యానవనంలోవున్న కుటీరమందు ఏకాం

**ఏకా రామశేషగిరిరావు**

తంగా కూర్చొని ధ్యాననిమగ్నుడై కుమార్తె పెళ్ళి విషయాన్ని ఆలోచించ సాగాడు. ఎంత ఆలోచించినా అది తేలేటట్లు కనపడ్లేదు.

ఇంతలో తోటమాలి రాజును సమీపించి రాజా! అని పిలచాడు. రాజు కళ్లుతెరచి ఏం! తోటమాలీ! ఎందుకు యిక్కడకు వచ్చావు? అని రాజరాజు ప్రశ్నించాడు. తోటమాలి మహారాజా! ఒక గంటక్రితం నా కో కలవచ్చింది. ఆ కలలో మీ అమ్మాయిగారి పెళ్లికథ పూర్తిగా జరిగింది. అని చెప్పాడు. తోటమాలి పెళ్లివిషయాన్ని ఎత్తేసరికల్లా రాజరాజుకు ఆ కలలో జరిగిన కథను తెలుసుకోవాలని అభిలాష కల్గింది. అయితే కలలోజరిగిన సంగతంతా చెప్పమని అడిగాడు రాజరాజు.

అంత తోటమాలి రాజా! పాండ్యరాజు మనదేశంపైకి అనుకోకుండా దండెత్తివచ్చాడు. అప్పుడు మనసైన్యం తయారులో లేకపోవుటవలన పాండ్యరాజు సైన్యము మనసైన్యాన్ని సునాయాసంగా జయించి మనరాజ్యమును ఆక్రమించుకున్నది. మనము లొంగిపోయామని తెలిసిన పిదప మీ అమ్మాయి అయిన సుందరిని పాండ్యరాజు కుమారుడగు వీర్‌రామ్‌కు యిచ్చే షరతు మీద వాళ్లు తమదేశమునకు తిరిగి పోయిరి. మహారాజా! మీరు ఆ షరతుకు ఒప్పుకొని సుందరిని పాండ్యరాజు కుమారుడగు వీర్‌రామ్‌కిచ్చి వైభవోపేతంగా వివాహం చేశారని కలకన్నానని తోటమాలి చెప్పాడు.

సరే! నీవు వెళ్ళు. ఆ సంగతి నేను ఆలోచించి కనుక్కుంటానని రాజరాజు తోటమాలితో అన్నాడు. తోటమాలి కల ఒక విధంగా రాజరాజుకు పెళ్ళిసమస్యను పరిష్కరించే విధంగా తోచింది.

మరుసటిరోజు పాండ్యరాజుకు ఒక ఉత్తరంవ్రాస్తూ, నా కుమార్తె అయిన సుందరిని మీ పుత్రుడగు వీర్‌రామ్‌కు యిచ్చి వివాహం చెయ్యటానికి నిశ్చయించుకున్నాము. మీరు దానికి అంగీకరిస్తే వెంటనే తెలియచేయవలసిందని వ్రాసి ఆ ఉత్తరాన్ని రాజగురువు కిచ్చి పంపాడు.

ఆ ఉత్తరం చూడగానే పాండ్యరాజుకు రాజరాజులో కల్గిన మార్పుకు ఆశ్చర్యం కల్గింది. సుందరి అందకత్తె అనీ, తెలివితేటలూ, చురుకుతనమూ కలదని పాండ్యరాజు యిదివరకే విని వుండటం వేరే ఆలోచించక అంగీకరించినట్లు తనజవాబులో తెలియజేశాడు.

రాకుమారి సుందరికీ, రాకుమారుడగు వీర్‌రామ్‌కూ వైభవంగా వివాహం జరిగింది. చోళ, పాండ్య దేశాల్లోని ప్రజలు పెళ్ళిజరిగిన అయిదురోజులు కులాసాగా సంతోషంగా గడిపారు. పెళ్లికూతురుకూ, పెళ్లికొడుకూ ఎన్నో బహుమతులు కుప్పలు తిప్పలుగా ఎన్నోచోట్లనుంచి వచ్చాయి.

వివాహం జరిగిన తర్వాత చోళరాజగు రాజరాజు ప్రధాన మంత్రి మొదలు, సేవకుని వరకు అందరినీ ఆహ్వానించి ఒక సభ చేశారు. అందరికీ వారి వారి హోదాల ననుసరించి బహుమతులు యివ్వసాగాడు. అందరికీ యిచ్చిన పిదప చివరకు తోటమాలి మిగిలాడు.

సభాసదులందరూ తోటమాలి కల వల్లనే రాజరాజు ఏరి కోరుకున్న అల్లుడు లభించాడనీ, రెండు రాజ్యాలూ ఈ సంబంధంవలన ఏకమయి పోయినవనీ యింతపని జరగటానికి కారకుడైన తోటమాలికి రాజరాజు ఎంత పెద్ద బహుమతి యిస్తాడో అని ఎదురు చూడసాగారు.

అంతట రాజరాజు లేచి సభాసదులారా! తోటమాలికి పగలే కల వచ్చిందని నాకే కాదు మీ అందరికీ తెలుసు. తోటమాలి పగలంతా తోటలో చెట్లకు నీళ్లు పోయటం, వాటిని జాగ్రత్తగా కాపాడటం మొదలగు పనులు చేయాల్సిన విధి వుంది. ఆ విధిని వదలి నిద్రపోవటం స్వామిద్రోహం చేసినట్లయింది. అతని విధిని అతడు నిర్వర్తించక నిద్రపోవుటవలన ఆ నిద్రలో కలవచ్చి అది ఒక మేలుకు మార్గాన్నిచూపినా అతడు తోటమాలిపనికి అర్హుడుకాదు. ఈరోజు నుంచి తోటమాలి తనపనిలో నుంచి విరమించుకోవాలి అని రాజరాజు ఉపన్యాస ధోరణిలో మాట్లాడాడు.

సభాసదులందరూ ఒకరిముఖం ఒకరు చూసుకుంటూ అరే! మనలో ఒకడికైనా అటువంటి అభిప్రాయం తట్టిందా? అని పకపక నవ్వుతూ రాజరాజు తెలివితేటలకు మెచ్చి ఆయనను అభినందించారు.

(ఒక ఆంగ్ల కథ ఆధారంతో)

గుజ్జనగూళ్ళు

# లాడితెని సాహసకృత్యాలు

**శ్రీ కామేశ్వర శర్మ**

ఎంతవాళ్ళనుకూడా ఏదోవిధమైన జీవనోపాధి చూపించక మానడు దేవుడు. అలానే అడవిలో కట్టెలు కొట్టుకొని ఆ డబ్బుతో సుఖంగా తనూ తన భార్యా కులాసాగా కాలక్షేపం చేసేవారు. కాని వారికి సంతతం ఒకటే విచారం. పిల్లలు లేరని "నిజంగా పిల్లలు లేనిఇల్లు ఎంత చిన్నబోతుంది" నిజమేమరి. అకోరిక తీరడం ఎలా? పాపం ఆభార్య ఎంత విసుగెత్తిందోమరి. అఖరుకు నా బొటకన వేలంత కుర్రాడున్నా ఎంతో సంతోషిద్దును అనుకుంది ఆమె.

ఆశ్చర్యం. కొంతకాలానికి ఆమె గర్భవతియైకుమారుణ్ణి కన్నది. సరిగ్గా కుర్రాడు ఆమె బొటకన వేలంతే వున్నాడు. బలమైన వాడే - ఎంత బలిష్టమైన ఆహారాన్నిచ్చినా - అతడంతే వున్నాడు- ముద్దుగా, అంతా "లాడితెడు" అని పిలిచేవారు.

చాల తెలివైనవాడు లాడితెడు. ఒకరోజు తండ్రితో అడవికి వెళ్లేడు కట్టెలు కొట్టి బండితో తేడానికి. తండ్రి అడవిలో వుండగా బండి యింటికి చేరడం ఎలా? తండ్రిని బాధిస్తోంది ప్రశ్న. "నేను తీసుక వెళ్తానాన్నా! నన్ను గుఱ్ఱం చెవిలో కూర్చుంపెట్టు, సరిగ్గా ఇంటికి తీసుకవెళ్తా బండిని" అని ధైర్యంగా చెప్పేడు లాడితెడు.

దారికడూకు గుఱ్ఱాన్ని అదలిస్తూ తీసుకవెళ్తున్నాడు. దారిలో దొంగలిద్దరు కన్పించారు—గుఱ్ఱాన్ని అదలించడం వింటూనే వున్నారు. కాని గుఱ్ఱాన్ని నడిపేవాడు కనిపించడం లేదే! ఏమిటీ ఆశ్చర్యం విసుపోయారు దొంగలు. చూద్దాం ఈ చోద్యాన్ని అని బండివెంబడే పోయారు. అఖరుకు లాడితెని తండ్రి అతణ్ణి గుఱ్ఱం చెవిలోంచి తియ్యడంచూసి, ఇతడు మన దొంగతనానికి ఎంతో వుపకరిస్తాడు. ఇతణ్ణి ఎలా ఐనా కొనాలి, అని అనుకుని దొంగలు లాడితెని తండ్రితో "అయ్యా! నీ కుమారుణ్ణి మాకమ్మ నీకు ఎక్కువగాడబ్బు యిస్తాం..." అన్నారు—

"బాబుల్లారా! ఇతడు నాకుమారుడు- ఎలా అమ్మడం" అనగానే లాడితెడువిని- వచ్చే డబ్బుయొక్క మొత్తాన్ని గురించి ఆలోచించి తండ్రితో "నాన్నా-నాప్రాణానికేం భయంలేదు...నే నెలాగోలాగ వచ్చేస్తాను సురక్షితంగా నన్ను అమ్ము." అన్నాడు. సరే అని తండ్రి బంగారం పుచ్చుగా తీసుకొని లాడితెణ్ణి అమ్మేడు. లాడితెడు దొంగటోపీమీద కూర్చొని ప్రయాణాన్ని సాగిస్తున్నాడు,

రాత్రి ఐంది. ఒక బయల్లో పడుకున్నారు. లాడితెడు కూడా...నిజానికి లాడితెడు నిద్రపోవడంలేదు. పారిపోడానికి అదనుకోసం ఎదురు చూస్తున్నాడు. చుట్టుపక్కల కలయచూశాడు. ఒక ఎలక్కన్నం కన్పట్టింది. "వస్తానండి" అని అదొంగలతో చెప్పి ఎలక్కన్నంలోకి మారిపోయాడు లాడితెడు. దొంగల కోపానికి మేరలేకపోయింది. అన్ని దిక్కులా వెతికేరు. లాభంలేకపోయింది.

వారు వెళ్ళిపోగానే—పైకివచ్చి ప్రయాణం సాగించాడు లాడితెడు. పచ్చికల్లోంచి నడుస్తున్నా ఆ పచ్చికయే అతనికి ఎంతో పెద్దవృక్షాల్లా గోచరిస్తున్నాది. ఇంతలో మరో దొంగలిద్దరు అక్కడవున్న ధనవంతుల యిల్లుదోచుకోడంఎలాఅనిఆలోచిస్తున్నారు. "నేను చెప్తా, నేను చెప్తా" అని అరిచాడు లాడితెడు. భయ బడ్డారు దొంగలు ఈ ధ్వని యెక్కడనుంచివస్తున్నదో అని. "ఇక్కడే - మీ బూటుదగ్గరే—" చూశారు దొంగలు. "నువ్వు మా కేలాసహాయపడగలవు?" అని అడిగారు. "ఓస్ అదో గొప్ప సంగతా ఏమిటి? నేను కిటికీ వూచలసందులోనికి వెళ్ళి బంగారాన్ని తీసుకవచ్చి మీకిస్తా" అన్నాడు లాడితెడు. బాగుంది ఆలోచన అని అతనితో కూడా వెళ్ళారు దొంగలు.

ధనవంతుని గృహంలోకివెళ్ళాడు, వెళ్లినది తడవు గట్టిగా అరవడం మొదలిడాడు. "ఇక్కడుంది బంగారం, ఇక్కడుంది వెండి," "పట్టుకోండి దొంగల్ని—" అని అరవడం మొదలెట్టేడు. ఆ కేకలకి ఇంట్లోవారు లేచారు - దొంగలు పారిపోయారు - గడ్డికుప్పలోకి పోయాడు లాడితెడు.

"ఏమిటి చెప్మా ఈ కేకలు - స్వప్నమా?" ఆశ్చర్యపోయారు ఇంట్లోవారు. పనిమనిషి గడ్డితీసి ఆవుకు వేసింది. ఆగడ్డిలో వేడున్నాడు లాడితెడు. నిద్రనుంచి లేచేసరికి ఆవునోట్లోవున్నాడు - ఏం చేస్తాడు? బేజారయి లాభంలేదని ధైర్యం పూనాడు. పళ్ళక్రింద పడకుండా తప్పించుకొని ఆవుకడుపులోనికి పోయాడు - ఆ జాగా లాడితెనికేం నచ్చలేదు. కిటికీలులేవు - ద్వారాలులేవు, అఖరుకు ఖాళీస్థలంకూడ లేకపోయింది. ఏమంటే-అంత లాగింటోంది గడ్డిని ఆవు. అందువల్ల లాడితెడు తిరగడానికికూడా బాగాలేకపోయింది. ఇకలాభంలేదనుకొని - "గడ్డి యింకొద్దు" అని అరవడం మొదలుపెట్టేడు, పనిమనిషి పాలుతీస్తోంది. ఈ విచిత్రాన్నిచూచి అబ్బరపడి భయంతో యజమానితో చెప్పింది. "ఆవుఅరుస్తోంది- కాదు కాదు...ఆవు మాట్లాడుతోంది... ఆవు మాట్లాడుతోంది..." అని.

"ఫో - ఆవేమిటి - మాట్లాడ్డమేమిటి- నాన్సెన్స్-ఫో-" అనికసిరేడు యజమాని. నిజమనకూడదా అని ఆవుదగ్గరకు వెళ్ళేడు యజమాని. ఆవు యథాప్రకారం అరుస్తోంది, "గడ్డియింకొద్దు" అని. యజమానికి చికాకు వేసింది. ఆవు మంచిది కాదని చంపమని అనుజ్ఞ యిచ్చాడు.

ఆవు చంపబడింది. ఆవు కడుపుభాగం పెంటకుప్పలో పారవేయబడింది. ఆ పక్క నేమాటువున్న తోడేలు ఆమాంసాన్ని కరచుకపోయింది తినేది. లాడితెడు కెక్కడవున్నా ఒక్కలాగే వుంది. సుఖం లేకపోయింది. కడుపులోంచే తోడేలు కిలా చెప్పేడు. "నీకు మంచి ఆహారం కావాలా?" అని తిప్పకుండా అని లాడితెడు తీసుకపోయిన యింటికి వెళ్లింది తోడేలు. అది అతని తండ్రియిల్లు. కాలువగుండా లోనికెళ్లి అక్కడవున్న బీర్వాను. యింకా విలువైన వస్తువుల్ని తిన్నది తోడేలు- ఇంకా తింటూనే వున్నది. తింటూన్నకొద్దీ కడుపు పెద్దదవుతూనేవుంది- అఖరకు తినడాన్ని మానివేసివెళ్లిపో ప్రయత్నించింది. వెళ్ళడం ఎలా? ఆకాలువలోంచి వెళ్ళడానికి పట్టడంలేదు. ప్రయత్నిస్తోంది. తోడేలు. ఇదేదేమయం అనుకొని కేకలు వేయసాగేడు- ఏదో గల్లంతని గుర్తించి, గొడ్డలి తీసుకవచ్చి తోడేలు తల నరికివేశాడు. తోడేలు చనిపోయింది. ఇంతలో లాడితెడు "నాన్నా నేను ఈ తోడేలు కడుపులో వున్నా- వేగంగా కత్తెర తీసుకవచ్చి ఈ కడుపునుచీల్చి నన్ను బైటకు తియ్యి" అని అరిచాడు. ఆశ్చర్య సంభ్రమాలతో ఆనందాశ్రువులురాల, తలితండ్రులిద్దరూ లాడితెణ్ణి రక్షించుకున్నారు.

"అబ్బా ఎన్నాళ్లకు చూశాం తండ్రీ" అని సంతోషాన్ని వెలిబుచ్చుకొని, లాడితెణ్ణి సాహసకృత్యాలు విని, మెచ్చుకొని ఇకముందు ఎంత ధనాన్నిచ్చినా అమ్మమని నిశ్చయించుకొని, ఆ తల్లితండ్రులిద్దరూ తమకుమారునితో సుఖంగా కాలం గడుపుతున్నారు.

సుప్రసిద్ధ అమెరికన్ జర్నలిస్టు వాల్టర్ లిప్‌మన్. ప్రస్తుతం భారతదేశంలో పర్యటించుచున్నారు. వారు యూరప్ పర్యటనను ముగించుకొని మధ్య ప్రాచ్య దూర ప్రాచ్యాలలో పర్యటించబోతున్నారు.

డెన్మార్కులో అమెరికా రాయబారిగా నియమింపబడిన శ్రీమతి యుజినీ ఆండర్సన్-ఇలాంటి రాయబార గౌరవాన్ని స్వీకరించటానికి, అమెరికా చరిత్రలో యీమెయే ప్రథమ స్త్రీ.

Call of Youth

పొటెన్సాన్ యుద్ధానంతరం వచ్చిపెట్టబడిన ఒక దివ్య ఔషధం. తరం సంపూర్తిగా యుద్ధ కాలంలో ఇండియాలో ఉన్న అమెరికన్ సైన్యాలకు సేవ చేసింది. ఇండియాలో యుద్ధం నుంచి తిరిగివచ్చిన తరువాత ప్రజలకు కోల్పోయిన బలం తిరిగి ప్రసాదించిన పొటెన్సాన్ కృతజ్ఞులై యున్నారు.

POTENSAN
FOR LASTING ENERGY & RADIANT YOUTH
KAR & CO., 2, Thambu Chetty St., Madras 1.

బంగారం ఉచితం
GENERAL SUPPLY CO., P. B. 76 (A.P.)
AMRITSAR.

న్యూ గ్రేట్ ఇన్సూరెన్స్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
45-47, అపోలో స్ట్రీట్, ఫోర్టు, బొంబాయి.
అధికారముపొందిన మూలధనము రు. 2,50,00,000.
చందావేయబడి జారీ చేయబడిన మూలధనం ..... రు. 1,25,00,000.
చెల్లింపబడిన మూలధనం ..... రు. 32,50,000.
జీవితము-ప్రమాదము
అగ్ని ప్రమాదము-
సముద్రయానము.
బ్రాంచి: 121-ఏ, ఆర్మీనియన్ వీధి, మదరాసు.

# కవితా నిర్వచనము

కవిత్వమంటే యేమనుకోవాలి?—"శబ్దః కార్యం కావ్యమ్"—"రసాత్మకం కావ్యమ్"—అని మనము కష్టపడి తెల్సుకోవలసిన సంగతిని, పెద్దలయిన లాక్షణికులే మనకు తెల్పి ప్రసాదించివున్నారు.

దాని వుద్దేశమేమంటే—

"సద్యః పరనిర్వృతయే—కాంతాసమ్మిత తయోపదేశయుజే" అనే అనుశాసనం ప్రత్యక్షమై-తాత్కాలిక బ్రహ్మానంద మిస్తుందని-కాంతా సమ్మితమని చెప్తుంది. యిక్కడ "సద్యః పరనిర్వృతయే" అంత చిక్కుపెట్టదు కాని—"కాంతా సమ్మితతయా" అనునది కొంత తొందర నిస్తుంది. యేమంటే—

"కవితా రసగ్రహణానికి వకపురుషులే అర్హులు స్త్రీలు గారా? కాంతా సమ్మితత్వము ననుభవించేవాళ్లు పురుషులుగాని-స్త్రీలు అయినప్పుడే మనవలె? అంటే—

కొంచెం ఆలోచిస్తే,

పురుషులకు స్త్రీలవల్ల కలిగే ఆనందం స్త్రీలకు పురుషులవల్ల కల్గుతుంది గనుక స్త్రీలను వారి ప్రేమపాత్రులయిన భర్తలు అనుభవించే రీతులను వుదాహరించుకోవచ్చును.

ఇట్టి సందర్భంలో శ్రీ నన్నయ్యభట్టు గారు ప్రథమంగా సెలవిచ్చిన

"విశ్వశ్రేయః కావ్యమ్" అనే ప్రయోజన నిర్ణయ సమస్య కనుపడుతుంది.

దీనికి జవాబు కొంచెం చిక్కు అయిందా? బ్రహ్మాండ మయ్యింది. బావతునాను.

నేటి వారు దీన్ని పాటిస్తూవున్నారా? దీని పిమ్మట వుండే

"తద దోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" ... అనే అనుశాసనాన్ని యెంతమంది పాటిస్తు వున్నారు.

"పడవ గాలికి యెంకి
పై కెగురు తా దంట
పెడ పాటు వూ సోటి మినుకు మంటా దంట"

"అంచల్లో-బొమ్మల్లో-
అద్దాల బరిణల్లో సుక్కల్లో నా యెంకి సురిగిపోయింది."

ఇందులో విశ్వశ్రేయః కావ్యం—తదదోషౌ పరికృతౌ చ వాగర్థౌ". అనే లక్షణానికి లక్ష్యం యిందులో కుదురుతుందో లేదో గాని "సద్యః పరనిర్వృతయే" అనే లక్షణానికి.

"అంచల్లో-బొమ్మల్లో
అద్దాల బరిణల్లో
సుక్కల్లో-నా యెంకి-సురిగిపోయింది."

అనడంలో "హంస-బొమ్మ-అద్దాల బరిణ-చుక్క-ఏమీ లేక పోవటం" అనే వుత్తరోత్తర సారాలంకారము యిమిడి-ఆ ప్రేమపాత్రమయిన అందమయిన యెంకిని విరహవేదనతో నాయకుడైన నాయుడు బావ తలపోసినాఁడనగా పాత్రో చితాలంకార మర్యాద ప్రేమ ప్రతిబింబం-అంతా యింతేనా చెప్పేటట్టున్నాది.

కొంతమంది కేవలం ప్రయోగశరణాలాల పమాసమునసు లై-యేమంటి! వేంకటస్వామి శాస్త్రి గారూ! తలా నా శాస్త్రిగ్నానిసిగ మున్నారు. మీరు అవధానములో కవిత్రయ సమ్మతమయిన కవిత్వం చెబుతారా? అని ప్రశ్నించారు ఆ ప్రశ్నంబులో.

"విద్యా వివేకాయ" గాక
"విద్యా వివాదాయ" నాకు స్ఫురించింది.

అందుకు నేను తడుముకోకుండా "వక లాగ్గు తిప్పను హిమాలయపర్వతంతో పోల్చటానికి? నాకున్న కవిత్రయము వాళ్లకూ సంబంధమా? బాబూ!" అన్నాను.

"వూఁసీ! తిరుపతి వేంకటేశ్వరమహాకవుల కవిత్వం వుంటుందా మీ యవధానంలో? అని వుపరి ప్రశ్న.

అందుకు నాకు కొంచెం కినుక వేసి "బాబూ! కవిత్వమంటే యేమో నిర్ణయం సరిగా నా మనస్సులో యేర్పడలేదేమో?

"నా కవనము నా కవనమే" అని జవాబు చెప్పి పంపాను. ఈ జవాబుతో ఆ మహాశయుడు నా దగ్గరకు మళ్లా రాలేదు. కారణము అడిగింది వక శాస్త్రి గారి పేరుతో యిరువే అడిగాడో-లేక-యెవరో వక శాస్త్రిలాగా రితణ్ణి నావద్దకు పంపారో తెలియదు గాని-యెవరైతే నేం? అందు శ్లేషస్వోత్కర్షలకు కొంత వరకు తృప్తి పడ్డారేమో అనుకొంటాను. కారణం అంత మూకుడుగా వచ్చిన ప్రశ్న యింకో రూపంలో మరలా రాకపోవటమే.

"లంగీ-తెలంగీ-పరంగీ-పిరంగీ - సుసంగీతభంగీ ప్రసంగీ యగుచు"

అని నేను శ్రీ యాంధ్రరత్న స్మృతి

## కవిచక్రవర్తి, శతావధాని శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారు

లో కాబోలు వ్రాసిన వక పద్యాన్ని వక పెద్ద మనుష్యుడు చూచి-యిది శ్రేషణానందంలోని.

"ముంగాల సింగారమూం గారు మేలి బంగారు రంగారు లంగా" అనే పాదము యొక్క వుత్త్రిక గదా?" అన్నాఁడు.

నేను చిత్తమండీ అన్నాను.

ప్రక్కనుంచి యింకొక పెద్దమనుష్యుఁడు కూచిమంచి కవిసార్వభౌములుగారిలో.

"పాటీర వర్ణందు కోటీర గారవధూటీ రఘా దివ్య కోటి తేజ!" అనే పద్యం చూచారా? అని చెప్పి నాకు కొంత సాయం చేశాడు.

నా మనస్సులో పుట్టుసమాగం కవిత్వం, విశ్వమానవ జాతికి సార్వజనీనంగా వుపయోగపడవలె ననే వుంది. అయితే-ఆహారంలో అన్నానికి వ్యంజనము లెట్లా అవసరమో కవిత్వానికి భాషా సౌందర్యము శబ్దార్థాలంకారములు దాని పరమార్థ నిర్వహణానికి అవసరము అని తోస్తున్నది.

అయినా-"కవి-కవిత్వం" అనే పదాలకి నిర్వచనం ఫలానా యింతవరకు నికరంగా చేతినట్లేనా?, యింటి గొడవలు చెప్పడానికి యింటివాఁడే పూనుకొంటే తెములుతుందా? పరాయి వాఁడు సింహావలోకనంగా చూచి చెప్పవలెను.

క॥ కవితా కన్య రసజ్ఞతఁ
గవికన్న రసజ్ఞుఁ డెఱుఁగు-గవి యేమెఱుఁగున్,
వనకోమలాంగి సురతము
ధవుఁ డెఱుఁగును-గాని-దాని తండ్రి యెఱుఁగునే"॥

శ్రీ సద్గురు సచ్చిదానందేంద్ర సరస్వతీస్వామివారు. ఈ నెల 15 వ తేదీన అనంతపురంలో సమాధిస్థితులై భగవన్నామము చేస్తూ దేహయాత్ర చాలించారు.

## స్వర్గానికి నిచ్చెనలు

(8-వ పేజీ తరువాయి)

పము నిర్మించవలయు నని హరశాస్త్రి ట్రుబట్టెను. వసుంధర వల దన్ననుపయోజనము లేకపోయెను. దేవాలయములో నొకచోట శిశికి వాశ్రమము నిర్మించి. ఆ యాశ్రమమునకు గొయ్యమూలములు నొకటియే ద్వారబంధము చాలు నని వసుంధర. దానికి మూఁడు ద్వారములు నిరుపమాలములు వేయవలయు నని హరశాస్త్రి. మూఁడునైపుల వరండాలు దింపవలయును. చివరకు హరశాస్త్రియే గెలిచెను. వామదేవుఁ డున్నచోఁ దన యిష్టము వచ్చినట్లు జరిగెడిదేమో? అను నొక యాశ లేకపోలేదు. ఇప్పుడు వామదేవుని యవసర మంతగ లేదు. లేకపోవుట యేమి? యున్నది. బాలావిగ్రహము ప్రతిష్ఠింపవలయును. అందుచేత వసుంధరకు వామదేవునియెడఁ బూర్తిగా వ్యతిరేకభావము లేదు.

వామదేవుఁడు వచ్చుచునే యిద్దరి వంకను జూచెను. వచ్చితివా? మహర్షీ! యని వసుంధర యావేగపడలేదు. ఉమాకాంతుఁడు సాష్టాంగప్రణామము చేయలేదు. వామదేవుఁడు వసుంధరను చూచుచునే "నా కిన్నాళ్లుగా వచ్చుటకు వీలు లేకపోయినది, స్వర్గములోఁ జాల వింతలు జరిగినవి. మనుష్యులకు మీ కా ప్రసక్తి యక్కరలేదు. నే నీ వచ్చుట మరల తిరిగి పోను. ఇచ్చటనే యుండెదను. ఇన్నాళ్లుగా నీకు సాహాయ్యపడ లేకపోయినందుకు జాల చింతించుచున్నాను. కాని సర్వకాలములయందు మా యాశీర్వాదము: మా మహిమయు నిన్ను రక్షించుచునే యున్నవి. ఇప్పుడు దేవాలయసంప్రోక్షణ జరుగవలయును. నీ పినతండ్రి వేణుగోపాలస్వామిని ప్రతిష్ఠించవలయు నని కూర్చుండెను. నీ కది యిష్టము లేదు. బాలావిగ్రహము ప్రతిష్ఠించవలయు నని నీ కోరిక. బాలనే ప్రతిష్ఠింతము. హరశాస్త్రితో నేను చెప్పెదను. అతనివలన నేమియు నిబ్బంది లేదు." అంతటి వైముఖ్యములో వసుంధరకు వామదేవునియెడల సౌముఖ్యము గలిగెను. వసుంధర "మీరు మరల నన్ను వదలి పోరాదు. నేనిచ్చట నిస్సహాయురాలనుగా నున్నాను. ఈ కామాటమును పెట్టుకొంటిని. పండ్లబిగువుచేతఁ గొనసాగించుకొనివచ్చుచున్నానుగాని నాకు సామర్థ్యము లేదు. గురుమూర్తులు తమరు దయచేయుదు రని యూరునెల లెదురుఁజూచి చివరకు నిరాశ చేసికొంటి"నని నెను.

ఉమాకాంతుఁడు నిలుచున్నవాఁడు నిలుచున్నట్లు క్రుంగిపోయెను. వసుంధర తోఁ దా నెంతయో నేర్పుతో మాటాడి యామెవిశ్వాసమును గడించెను. క్రమముగాఁ దానే యిచ్చట నధికారి కావుటకుఁ బునాది వేసెను. అతఁడు తన భార్యనుఁ జూచి యెన్నాళ్లో యయ్యెను. ఆమెయందు దనకు మమకారము పోలేదు. ఆమె యోగిని యయిన దని మనసు విరుచుకొనెను. కాని పదునేనుదినముల క్రింద నతఁడు రైలు దిగి వచ్చినప్పుడు వసుంధర తనవంకఁ జూచిన చూపుతో నతనికి నామెయెడ మరల మన్మథభావ మంకురించెను. ఈ యర్ధరాత్రమువందలి ప్రసంగములో వా రిద్దరు నట్టి వ్యవహారము మాటాడినను వారి చూపుల వెనుక శృంగారరసస్ఫూర్తి తగులుచునే యుండెను. తాను నిదానించి చూచినప్పుడు వసుంధర కనుచూపు మలచుకొనుట, యొక లీలావిశేషముగా నిలచుండుట, యభినయించఁబోయిన తీక్ష్ణత్వము, కృతకముగా భాసించుట, మొదలయిన లక్షణములు వసుంధరయందు గోచరించెను. ఆ లక్షణము లామె తనయందుఁ బ్రసన్న యయిన దనుకొనుటగా సమన్వయించవచ్చుగాని యుమాకాంతుని సర్వమయిన యూహయు నిత్యము స్త్రీభావలగ్నమయి యుంటచే నతనికి సర్వస్త్రీల సహజవిలాసములు ప్రథమతశ్శృంగారస్ఫూర్తిమంతములు, ఈమె తాను వివాహమాడిన స్త్రీ. ఇచట నట్టి యూహ కలుగుట కభ్యంతర మేమి యున్నది? ఈమె యోగిని యందురా? అనుకొన్నంతగాఁ గన్పించలేదు. పరిపుష్టమయిన శరీరావయవములు. నిత్యసంస్కృతములయిన కేశములు. అందమయిన చీర. అవయవరమణీయతాస్ఫోరకముగా ధరించుట. అవయవసన్నివేశచారుత్వమును వెలికి దెచ్చు పరిమితభూషణములు. సర్వము సంసారిణీ లక్షణమే. అదియుఁ గాక నొక యధికారము. ఆమె కదలినచో, మాటాడినచో వందమంది దృష్టు లామెమీఁద నెలిపి వినయము ప్రదర్శింతురు. ఆమెవద్ద రెండు మూఁడు లక్షల యాస్తి యున్నది. అట్టి స్త్రీ నిజముగా యోగిని కానిచో స్పృహణీయురాలు కాదా? ఆమెమీఁది తన యధికారము సహజసిద్ధమయినది. ఇప్పు డాలోచించినచోఁ దన చేతినుండి జారిపోయిన దన్న యధికారము మరల వచ్చినది. వచ్చినదే యనుకొనెను. ఇంతలో నీ వామదేవుఁడు వచ్చెను. ఇతఁడు వచ్చినంతనే తన చేతిలో నున్న యధికారము జారిపోయెను. జారిపోవుటయే గాదు. బలవంతముగా లాగికొనఁబడిన ట్లున్నది. తన యాధారము విచ్ఛిన్నమయిపోయిన ట్లున్నది. తన స్థితి మూఁడవనాఁటికి దనకు లేన ట్లయినది. తానచట నొక మనుజు డున్నట్లే లేదు. వసుంధరయొక్క సర్వశ్రద్ధయు వామదేవుని యందే నిహిత మయిన ట్లుండెను. ఉమాకాంతునకుఁ దా నచట నిలచుండెనో లేదో తనకే తెలియదు.

ఇంతలో నొక మహాశ్చర్యము జరిగెను. హరశాస్త్రి మేడమీఁదికి వచ్చెను. సంవత్సరమున్నరగా హరశాస్త్రి మేడమీఁది కెన్నఁడు రాలేదు. అప్పటికి రాత్రి మూఁడు గంట లయ్యెను. హరశాస్త్రి తన యాస్తి యంతయుఁ బోయి తనకుఁ దా వండుకొనుచున్నప్పుడుకూడ ప్రొద్దుగ్రుంకినంతనే పండుకొని తెల్లవారుఁజాముదాఁక లేచెడివాఁడు. వేయి డప్పు లాయన చెవులలో వేయించినను మెలకువ రాదు. ఇంత దేవాలయనిర్మాణము చేయించినను రాత్రుల యందే పనిమీఁద నతని యజమాయిషీ యుండదు. సింగరవేలో, కళాధరుఁడో, భూషణమో యుండి! రాత్రులందుఁ బని చేయించవలయును. రాత్రిపూట హరశాస్త్రి నేదయినఁ గనుఁగొనవలసివచ్చినచో నది మరునాటి ప్రొద్దుటికే. ఆ హరశాస్త్రి రాత్రిమూఁడుగంటలవేళ వచ్చుట వసుంధర కాశ్చర్య మయ్యెను. ఆయన వచ్చుచునే వామదేవునకు నమస్కరించెను. వామదేవుని హరశాస్త్రి యెట్లెరుగును? తా నెరిఁగియున్న మాట తనతో నెన్నఁడుఁ జెప్పలేదే! అకస్మికముగాఁ దన యింటికి వచ్చినట్లే వామదేవుఁడు హరశాస్త్రి యింటికి నేల పోరాదు? వామదేవుఁ డిట్లనెను. "హరశాస్త్రీ! నీకు నిద్రాభంగము చేసితిని." అని నవ్వి మరల "ఈనాటికి మేము వసుంధరావ్యవహారములో జోక్యము కలిగించుకొనవలసివచ్చినది. ఆమె యోగిని. నిజముగాఁ బ్రపంచముతో నామెకు సంబంధము లేదు. లోకమునందు ధర్మసంచయము చేయవలయు నన్న బుద్ధితో నామె యీ మహాకార్య మారంభించినది. ఇది మొదలు కొన్నాళ్ళవరకు మే మిచ్చటనే యుందుము. నవరాత్రములు పదునేను దినములలో వచ్చును. అప్పటికి దేవాలయ సంప్రోక్షణ జరుగవలయును. బాలయొక్క వల్లపాలరాతివిగ్రహము దక్షిణాదిని దొరకును. ఇది కాక వేరే రాగివిగ్రహము కావలయును. ఆగమవేత్తలు రావలయును. నందిగామతాలూకాలో, నొక పల్లెటూరిలో నాగమవేత్త లున్నారు. కార్య మంతయు జాల తొందరగా జరుగవలయును. కళాధరు డున్నాఁడు. భూషణ మున్నాఁడు. ఇదుగో ఉమాకాంతుఁ డున్నాడు. వీరి మువ్వురను నీ వెచటకుఁ బంపించవలయు ననుకొన్నచో నచటకుఁ బంపించుము. అవసరమయిన నీవు కూడఁ బొమ్ము. మొదట నా యాగమవేత్తలఁ గలిసికొని కావలసిన సంభారముల జాబితా నా కిచ్చుటకుఁ బంపవలయును. అతఁడు తీసికొరావలసిన పన్నియు సింగరవేలుచేతఁ జెప్పించెదను. కానివి వశిష్ఠగోత్రములు తెత్తురు. మే మిచ్చటనే యుందుము. రేపు ప్రొద్దున నే వశిష్ఠగోత్రములను నావద్దకు రావలసిన దని చెప్పుము. మరల నీతో నే నేమియుఁ జెప్పనక్కరలేదు. సంప్రోక్షణ ప్రారంభించునాటికే మరల నీతో మాటాడెదము" అనెను. హరశాస్త్రి మేడమెట్లు దిగిపోయెను. వామదేవుఁడు దిగిపోయెను. ఉమాకాంతుఁ డచ్చటనే నిలచుండెను. వసుంధరకు దిగ్భ్రాంతియో, యానందమో, సంతోషమో, యాశ్చర్యమో, నిస్తబ్ధతయో, యేమో తెలియదు. ఆమె తనతో మాటాడు నని యుమాకాంతుఁ డెదురుచూచెను. అమె మాటాడలేదు, మాటాడునట్టి స్థితిలోఁ గూడ లేదు. అతఁ డామెను పలుకరించలేదు. తాను నొక విచిత్రమయిన స్థితిలోనసే యుండెను. అతఁడును నెమ్మదిగా మేడమెట్లు దిగెను. పోయి పండుకొంద మనుకొనెను. కాని వామదేవు డెక్కడకు పోయెనో యేమి చేయుచుండెనో చూడవలయు నని పించెను. నాలుగయిదు స్థలములు చూచి దేవిపీఠ మున్న పాకలో తొంగిచూచెను. పీఠప్రదేశ మంతయుఁ గుంకుమతోఁ బువ్వులతో నిండి ప్రక్కన వెలుఁగుచున్న దీపపుకాంతికి సృష్ట్యారంభమున హిరణ్యగర్భుఁడు రూప మేర్పరచబోవుచున్న యగ్నిగోళమువలె నున్న బ్రహ్మాండపిండమువలెఁ గన్పించెను. ఆ ప్రక్కనే వామదేవుఁడు కూర్చుండియుండెను. అతఁడు నిమీలితనేత్రుఁడయి పద్మాసనము వేసికొని యభయముద్ర తాల్చిన హస్తము కించిదానమితముగా నిడుకొనియుండెను. అది నాటి రాకాసుల పాక. చూరులవెంట, నాకుల నడుమ, రాత్రులందు లెలుకలు సమృద్ధిగాఁ దిరుగుచుండును. ఒక యెలుక సరిగా వామదేవుఁడు కూర్చున్న పైభాగమున నెండకట్టువెంటఁ బరుగెత్తెను. చూరులో నున్న వస్తు వేదియో వామదేవునిమీఁదఁ బడెను. పడినవస్తువు బరువయినదిగాఁ గన్పించెను. వామదేవుఁడు కదలలేదు. ఉమాకాంతుఁడు గాబరా పడి పోయి క్రిందఁ బడియున్న యా వస్తువును చూచెను. అది కొబ్బరికాయలు కొట్టుట కుపయోగించెడు గుప్పెడు బొడిప ... పెద్దయినుపమేకు. ఉమాకాంతుఁడు వామదేవునకు దెబ్బ తగిలినదేమో యని దీపము పెట్టి పరీక్షించి చూచెను. వామదేవునిది వజ్రశరీరమా? అతఁడు నిజముగా మహర్షియేమో?

ఇప్పుడు మంచి నోటి సువాసన
... నిమిషాలవరకే కాదు
గంటల కొలది గూడ
శాస్త్ర పరిశోధనలవల్ల నూటిలో 80 కంటె హెచ్చు మందికి-నోటి దుర్వాసన నివారింపబడినది. నిమిషాలవరకే కాదు-గంటలకొలది-ఎట్లా? ఒకసారి లిస్టరిన్ టూత్ పేస్టుతో-దీనిని వి యితర దంతధావన ద్రవ్య ముతోగూడ పోల్చిచూడండి.
కొత్త లిస్టరిన్ టూత్ పేస్టు వాడితే, మీ నోటి సువాసనతో, నవ్వుల కాంతితో నీళ్ళన్ని వున్నప్పుడు ఎంతో మనోహరంగా వుంటుంది. ...
ప్రత్యేకముగా మరుగు గుణము మంచి నోటి సువాసన
LISTERINE TOOTH PASTE
కొత్త
నోటి సువాసనకు
57 B

వెక్సై బ్రాండ్ పాన్ మసాలా జర్దా కేవప్ కేసర్ బిలాస్ ఇలాచీ దానా
మహమ్మద్ ముస్తాఫా కంపెనీ
వెక్సై బ్రాండ్ జర్దా ఫ్యాక్టరీ
141 ... 455

అప్పులు
త్రైలిక వరతులమీద అప్పులు ఏర్పాటు చేయబడును. వెంటనే దిగువ అడ్రెసుకు వ్రాయండి.
BALKISHAN & Co.,
Post Box No. 114, Baroda.

ఆరోగ్యమందిరము
సర్కసు మైదానము, గవర్నరుపేట, బెజవాడ.
ఇచ్చట రోగులు నివశించుటకు చక్కని వసతిగలదు. శ్రీ భిషగ్రత్న డాక్టరు అచంట లక్ష్మీపతి, బి. ఏ. ఎం. బి. అండ్ సి. యం. గారు మద్రాసునుండి వచ్చి ఈ నెల 26-వ తేది మొదలు నెలాఖరు వరకు ఇచ్చట రోగులను పరీక్షించి సలహా యిచ్చెదరు.
బెజవాడ. 20-11-49. | మేనేజరు, ఆరోగ్యమందిరము.

యెత్తుకు పైయెత్తు
వరాయ మందులను అమ్ముచుండు వారి యెత్తుకు పైయెత్తు. గుణమునకు పూచీయని బిల్లుపై వ్రాసి యిమ్మనడమే. గుణం చేయకుంటే డబ్బు తిర్గి పుచ్చుకొనడమే.
పిల్లల ఆరోగ్యానికి జె. డబ్ల్యు. డిపో వారి గ్రైప్ టానిక్ గుణానికి పూచీయిచ్చి వర్తకు లమ్మెదరు. మీ గ్రామంలో లేకుంటే వెంటనే ఆర్డరు ఇప్పించండి వర్తకులచేత
వి. యస్. నారాయణ సన్స్‌వారికి,
H. O. కాకినాడ.
బ్రాంచీలు: విజయవాడ, విజయనగరం, విశాఖపట్నం, అనకాపల్లి.

బహిష్టు: 'ఋతూదయాని' వాడిచూడండి. ఋతుస్రావం యథాతథ పరిస్థితిలో జరుగుతుంది. 4/5 మాసాంపాటు బహిష్టు నిలిచిపోయిన కేసులైనా, ఇంకా ఏ ఇతర చిక్కులైనా 24 గంటలలోగా అద్భుతంగా నివృత్తి పొందగలవు. గ్యారంటీ రు. 5/- వి. పి. ఛార్జీ 0-14-0. (స్ప్రింగ్) రు. 20/- "ఉదయిని" నిరపాయమైంది. శాశ్వతానికి రు 6/- తాత్కాలికం రు 3/- వి. పి. 14 అణాలు.
ఒరుబీజం వరిబీజం, బోదకాలు, ఆర్చిటిస్, వాతరోగం మున్నగు వాటికి "విషాకర తైలాన్ని" పైపూతకు ఉపయోగించడంవలను, లోపలకు వేరేఔషధాన్ని సేవించడం వల్లను శాశ్వతంగా ఉపశమనం పొందగలరు. గ్యారంటీ వెల రు. 6-8/- వి. పి. ఛార్జీ 0-14-0.
Kaviraj S. K. CHAKRAVORTY (A.P.)
126/2, Hazra Road, Calcutta 26.
స్టాకిస్టు:— మిల్టన్ అండ్ మిల్లర్, 157 బ్రాడ్వే, మదరాసు.

సుధాచంద్రిక
అన్ని తగలకు ఒక్క రోజులో గుణము
... రాజమండ్రి.

ఫ్యామిలెట్
రుచ్యమైనది
గొంతు జబ్బుకు దేవదారుసంబంధమైనది.
బెంగాల్ కెమికల్ ప్రాడక్టు
BENGAL CHEMICAL
ఏజంటు: ఏ. దేశాయి గౌండర్ & కంపెనీ,
41, ... మదరాసు.

# 16-వ ఆంధ్రరాష్ట్ర సహకారసభ: అనంతపురం

16 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ, అనంతపురం. ప్రారంభకులు శ్రీ కె. వై. రమణయ్యనాయుడుగారు ఉపన్యసించుచున్నారు.

16 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ, అనంతపురం. జాయింటు రిజిస్ట్రార్ కె. సుబ్రహ్మణ్యంనాయుడుగారి ఉపన్యాసం.

16 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ, అనంతపురం—శ్రీ పి. రామాచార్యులగారి స్వాగతోపన్యాసం.

16 వ ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ, అనంతపురం—శ్రీ రేబాల దశరథరామారెడ్డిగారి అధ్యక్షోపన్యాసం.

కథానిక:

# పిల్లనగ్రోవి

శ్రీ వి. వి. సూర్యనారాయణ

ఊరి కొసనుంచే రహిమాన్ దుకాణం చాలామందికి తెలియదు. రహిమాన్ చచ్చిపోయినతరువాత ఆ దుకాణం తెరువబడలేదు. అతడు నాతో చాలా చనువుగా ఉండేవాడు. అతని చారల పైజమా, లేతకి టోపీ, కాళ్లకు రెండంగుళాల దళసరి చెప్పులజోడూ, పెదవులమీద చిరునవ్వూ—యిప్పటికీ కళ్లకు కట్టినట్లే కనుపిస్తాడు!

ఏవో ప్రాముఖ్యతగల పురాతనమైన వస్తుసామగ్రి సేకరించి జాగ్రత్తచేసే అలవాటుండేది నాకు, అప్పట్లో. అప్పటప్పట నేను సేకరించిన వస్తుజాలాన్ని చూసి గర్వపడుతూండే వాణ్ణికూడా. రహిమాన్‌కు ఒకటిరెండుసార్లు వాటిని చూపించేను. అతడు కుతూహలంగా కొన్ని వస్తువుల తాలూకు పాత చరిత్ర అడిగి తెలిసికొనేవాడు. సహజంగా అతనికి యిటువంటి కథలు వినడమంటే చాలా ప్రీతి. ఈ కథ ఎంత ప్రీతిగా వినేవాడో, క్రొత్త క్రొత్త వింతకథలంత బాగా చెప్పగల నేర్పుండేది అతనికి. నేను సమయం దొరికినప్పుడల్లా అతని దుకాణం మీద కూర్చొని, అతడు చెప్పేకథలాలకించడానికి, అనేక కారణముని చెప్పవచ్చు.

ఒకనాడు రహిమాన్ దుకాణంలో సామానుతీసి దుమ్ము దులుపుతున్నాడు. అక్కడే కూర్చొని అటూయిటూ పరికిస్తూన్న నా దృష్టి ఓ పిల్లనగ్రోవిమీద పడింది. అది పుచ్చుపని చూశా. ఎందుకూ పనికిరానిస్థితిలో, అది నిలువనా పసలేని ఉంది. అక్కడక్కడ చిన్న చిన్న ముక్కలుకూడా ఊడిపోయినాయి. దానిమీద అయిదారు స్థలాల్లో బురదమచ్చలు కూడా కనిపిస్తున్నాయి!

రహిమాన్ నావైపు చూచి అన్నాడు, "భాయీ! దాన్ని చూశావుకదూ? దాన్ని తప్పకుండా నువ్వు సేకరించే వస్తువుల్లో చేర్చాలి."

"ఏం? దాన్లో ఏం గొప్పతన ముందని దాన్ని జాగ్రత్త చెయ్యాలంటావు? చూడు, ఎందుకూ కొరగానంతా పాడయిపోయింది కూడాను" అన్నాను.

రహిమాన్ ఒక్కసారి కళ్లు చిట్లించేడు. కాని వెంటనే అతని ముఖంమీద చిరునవ్వు నాట్యంచెయ్యడం చూశాను. "అట్లా అనకు దోస్తూ, ఆ వేణువులో యేం గొప్పతనముందో! దాని గడచిన చరిత్రలో ప్రేమ, త్యాగం, ప్రతీకారము దుఃఖమూ యిమిడి యున్నాయి!! దానిమీద యేమని వ్రాసి యుందో నువ్వు చూడలేదూ?" అన్నాడు. కళ్లు యింతచేసి చూసి, దానిమీద అక్షరాలుకూడ బల్కొనూంటే, రహిమాన్ అన్నాడు, "అరబ్బీ నీకు అర్థం కాదా యేమిటి?" అన్నాడు.

"వీసీ, నువ్వు చెప్పేవరకూ ఆ మాత్రమైనా కూడా పట్టుకున్నాను. వానిలోని యీ మాటల అర్థమేమిటో చెప్పవా?" అన్నా.

నా చేతిలోంచి పిల్లనగ్రోవి తీసికొని, దానిమీద అక్షరాలు మెల్లగా చదివి, అర్థం చెప్పేడు......"ప్రియమైన సలీమా సమర్పించుకొన్న ప్రేమ కానుక. ఈ వేణువు మనల నిద్దరనూ యీ లోకంలోనూ, పరలోకంలోనూ కూడా ప్రేమపాశంతో బంధించి ఉంచాలని కోరు......"నీ ఫాతిమా!" అని అతడు గద్గదకంఠంతో చదువుతూంటే అతని కళ్లల్లో నీరు చిమ్మడం స్పష్టంగా కనుపించింది.

"రహిమాన్, ఏమిటి సంగతి?" అన గలిగేను బొంగురుపడ్డ గొంతుకతో.

ఇప్పు డతనిముఖం కొంచెం తేటపడింది. "సలీమ్‌నా యేకైకపుత్రుడు" అని నావైపు చూశాడు బరువుగా ఊపిరి విడుస్తూ. "అట్లాగా?" అన్నా, చేతిలోని పిల్లనగ్రోవిని మెల్లగా క్రిందపెడుతూ.

"అవును. ఆ సంగతి నీతో నన్ను పూర్తిగా చెప్పనిస్తావనుకుంటా. నీ వంగీకరిస్తే నా హృదయభారం కొంతవరకూ తగ్గినట్లు సంతోషిస్తాను......ఇలారా." అని నన్ను చెయ్యిపట్టుకొని, ఆ ప్రక్కనే ఉన్న చిన్న గదిలోకి తీసికొని వెళ్లేడు.

"అప్పుడు మేము అరేబియా దేశంలో ఉండే ఒక కుగ్రామంలో ఉండేవాళ్లం. నా జీవితం అక్కడ చాలా సాఫీగానే గడచిపోయేది, —దొంగలగుంపులు అప్పుడప్పుడు వచ్చి మా పల్లెలమీద వండేత్తే సమయాల్లో తప్ప. అప్పటికి సలీమ్ యింకా చిన్నకుర్రాడు. ప్రక్కింటి అల్లీఖాన్‌కూతురు, ఫాతిమాతో కలసి రోజూ బడికి పోతూండేవాడు. కాని వాడికి చదువుకంటె సంగీతంమీద మోజు ఎక్కువని గ్రహించిన నా భార్య, సలీమ్‌ని సంగీతశాస్త్రంలో ప్రావీణ్యుణ్ణి చెయ్యాలని తహతహలాడేది. తల్లిని ఆనందంగా చేసికొని, అసలు చదువులో పూర్తిగా శ్రద్ధ తగ్గించేసి, వాడు సంగీతంలోనే ఎక్కువ కృషి చెయ్యడం ప్రారంభించేడు......

"అల్లీఖాన్ వ్యవసాయంపని చేసి జీవించేవాడు. పిల్లనగ్రోవులు తయారు చెయ్యడంలోమాత్రం అతనికి అందెవేసినచెయ్యి.

"సలీమ్! నేనీ రోజున నీ కొక చిన్న బహుమానం చెయ్యదల్చుకున్నా." సిగ్గుపడుతూ అంది ఫాతిమా, ఒకనాడు వాళ్లిద్దరూ ఆ ప్రక్కనే ఉండే సెలయేటి ఒడ్డుకు వాహ్యాళి వెళ్లినప్పుడు.

"నాకా, ఫాతిమా! ఏమిటది?"

"సలీమ్! అది నీ కెక్కువగా ప్రేమించే వస్తువే. నువ్వు పంచప్రాణప్రియుడవు కావడంచేత, మా తండ్రిని బ్రతిమాలి ప్రత్యేకంగా నీ కొరకు చేయించే నీ వేణువిది. దీనిని నా ప్రేమకానుకగా స్వీకరించు.' ఆ ప్రేమ కానుక నతడు కృతజ్ఞతతో అందుకొని, ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు. ఆ క్షణంనుంచీ వారిద్దరూ ఒకర్నొకరు విడిచి ఉండలేకపోయేవారు. ఈ పిల్లనగ్రోవి ప్రేమపాశమై వాళ్లిద్దర్నీ బంధించింది! తరువాత కొద్దిరోజుల్లోనే వాళ్లకి వివాహంకూడా స్థిరపడింది.

వాళ్లు సౌఖ్యమయ జీవితాన్ని యెన్నాళ్లో అనుభవించలేదు. ఆ ప్రేమికుల్నిద్దర్నీ విడదీసే సంఘటన త్వరలోనే సంభవించింది! ఒకరాత్రి అకస్మాత్తుగా దొంగలగుంపు పల్లెమీదపడి చేతికి దొరికిన డబ్బు దోచుకున్నారు; కంటికందిన మనిషినల్లా చంపేశారు. కలకల్లాడుతూ ఉండేవూరు, తెల్లవారేసరికి శ్మశానంగా మారిపోయింది. ఈ దొమ్మీలాటలో అల్లీఖాన్, ఫాతిమా, నా భార్యాకూడా ప్రాణాలను గోల్పోయేరు!" ఈ మాట ముగించగానే రహిమాన్ ప్రక్కకు తిరిగి కళ్లొత్తుకోవడంచూసి అన్నాను, "వెర్రివాడా! ఎప్పుడో జరిగినదానికి యిప్పుడు విచారిస్తేమాత్రం యేం లాభం?...... తరువాత యేం జరిగింది చెప్పు."

నా ఆత్రుతను గమనించి రహిమాన్ మళ్ళీచెప్పడం మొదలుపెట్టేడు.—

"సీదా పనిమీద ప్రక్కవూరికి పోయి మర్నాడు దుదయాన్నే తిరిగి వస్తూన్న సలీమ్‌కు దారిలోనే చెప్పారెవరో, గతరాత్రి జరిగిన దారుణాన్ని సరించి. ఆత్రుతగా అతడింటికి పరుగెత్తుకని రాగానే, మొట్టమొదట అతని కంటపడిన దృశ్యం, తల్లి శవం! తరువాత ప్రక్కింటికి పోయి, తలుపుత్రోసే సరికి గుమ్మంలోనే కనపడింది, అల్లీఖాన్ నిర్జీవ శరీరం!! దాన్నికూడా దాటుకొనివెళ్ళి లోపలిగది తలుపుతోసేడు. ఆ దృశ్యం చూచేసరి కతని వళ్లు వణికిపోయింది. ఆ గదిలో ఫాతిమా యొక్క మొండెమూ, తలా వేర్వేరుగా పడియుండడం కనిపించింది!!! ఇక అక్కడ ఉండలేక మెల్లగా తలుపుమూసి బయటకు వచ్చేశాడు. దొంగలగుంపుచేత నానా అసహ్యంగానూ తయారు కాబడిన పీనులు చూచేసరి కతని దుఃఖం ద్విగుణీకృతమైంది.

"సలీమ్ హృదయంలో పొందే వ్యథ ముఖంమీద ప్రతిఫలించింది. తన వాళ్లను చంపిన కిరాతకుల అంతుచూడనిదే తనకు నిద్రపట్టదు! కొంతమంది గ్రామస్థుల సహాయంవల్ల, అల్లీఖాన్ యింటిలో దొరకపడిన దొంగ జాడా తెలిసికోగలిగేడు... ...సలీమ్ అట్టే బలవంతుడు కాడు. మిలిటరిలో చేరే మనిషికి కావలసిన అవయవసౌష్ఠవంకూడా అతని లేదు. చాలా సన్నగా బలహీనంగా కనపడేవాడు. అయితేనేం? ప్రయత్నంమీద, కొన్ని దినాల ప్రోత్సహించగా, రాజు సైన్యంలో ఒక సిపాయి కాగలిగేడు!

"యుద్ధవేటుడిగా కనపడంపవలసిన కొద్ది సామగ్రికితోడు, చనిపోయిన తన ప్రియురాలు బహూకరించిన పిల్లనగ్రోవికూడా ఎప్పుడూ అతని దగ్గరే ఉండేది! అతడు బ్రతికియున్నంతకాలమూ, యెన్నడూ ఆ ప్రేమ కానుకను యేమరియుండలేదు!! తన స్నేహితుల్ని రంజింపచెయ్యడానికి, అప్పుడప్పుడు మృదువుగా దానిమీద మధురగీతికల నాలాపించేవాడు. ఇలా తన జీవితాన్నొక విధంగా సాగా గడుపుతూన్నా, శక్తికిమించి కష్టపడి పనిచేయవలసిన అవసరము లప్పుడప్పుడు కలుగక పోలేదు. సైన్యంలో ఉద్యోగం చెయ్యడమెంత కష్టంగా ఉన్నా, శత్రువుల నెట్లాగైనా రూపుమాపాలనే ఆశ మనసులో ఉంచుకొని, సమయంకొరకెదురుచూస్తూండేవాడు.

"చివరకు అతని ఆశలు ఫలించేయి! దొంగలగుంపును పట్టుకొనేందుకు నియమింపబడిన సైన్యంలో, అతని పేరుకూడా చేర్చబడింది! అప్పు డతనికి కల్గిన ఆనందం మరెప్పుడూ కలుగలేదేమో! పిచ్చివాని ఆవేశంతో బయలుదేరాడు, దొంగలతో పోరాటానికి......

"యుద్ధం జరిగిన స్థలాన్ని చూసిన వాళ్లు మరునాడుదయాన్ని చెప్పినమాటలు......అక్కడ శవాలు కుప్పలుగా కూలి ఉన్నాయి! వీటన్నిటికీ కొంచెం మారంలో పడిఉన్న రెండు మృతకళేబరాల్లోనూ, ఒకటి సుకుమారుడైన కుర్రవానిది. ఇతనికి శరీరంమీద అట్టే గాయాలు లేకపోయినా, ఎక్కువగా ఆయాసపడడంవలన చచ్చిపోయి ఉంటాడు. రెండవది, కండలు తిరిగి, రాక్షసుడిలాగా ఉన్న బలవంతుడైన ఒక ముష్కరుడి శవం!!......"

అంతవరకూ ఉద్రేకంగా ఉన్న రహిమాన్ ముఖంలో రకరకాల భావాలు కనుపించినై, కొంచెం గొంతు తగ్గించి అన్నాడు. "నువ్వు నమ్ముతావో నమ్మవో, సలీమ్ యీ పిల్లనగ్రోవిని ఆ దొంగ గొంతుకలో అతినేర్పుగా గుచ్చేశాడుట! దెబ్బతో ఊపిరాడక చచ్చేడా దొంగవెధవ!!" యిట్లు ప్రతిధ్వనించేలా నవ్వడం మొదలెట్టేడు. నవ్వడం ముగించిన తర్వాత మళ్ళీ అన్నాడు, "నిజంగా యీ మురళి వాళ్లిద్దర్నీ బ్రతికుండగానూ, చచ్చిపోయిన తరువాతకూడా కలిపింది!... తరువాత యెవరో పుణ్యాత్ములు వివరాలు తెలిసికొని దీన్ని నా దగ్గరకు పంపించేరు." అని కథ ముగించేడు, తిరిగి ఆ పిల్లనగ్రోవిని నా చేతికిస్తూ.

దాన్ని పుచ్చుకుని, అటూ యిటూ త్రిప్పిచూస్తూ, "అయితే, దీనికింత యింటి చరిత్ర ఉందని నేననుకోలేదు. నువ్వు చెప్పినట్లు దీన్ని నామ్యూజియమ్‌లో చేర్చడానికి నాకెటువంటి అభ్యంతరమూ లేదు. పైగా సంతోషంతో స్వీకరిస్తానుకూడా. కాని, దాన్ని నా కివ్వడానికి నువ్వు మనస్ఫూర్తిగా సమ్మతించగలవా?" అనడిగేను.

"తప్పకుండా నవ్వుకొంటాను, నీవస్తు ప్రదర్శనశాల చూసిన వాళ్ళందరికీ, నవి యొక్క కథను నువ్వు తెలియజేస్తూ ఉంటావు. సలీమ్‌కూ ఫాతిమాకూ వేరుగంటూ మధ్యనుంచే మహత్తర ప్రేమగాథ నలుగురికీ తెలుస్తుంది. అందుచేత నాకెంతో సంతోషంగా ఉంటుంది. దీన్ని నీకివ్వడానికి నా మనస్సు గీకరిస్తుంది."

తరువాత దాని నిజమైన విలువను నిర్ణయించిన సౌమ్యు రహిమాన్‌కిచ్చి, ఆ వేణువును తీసికొని, దాని రాక చీటీనంటించి నా ప్రదర్శనశాలలో ఒక అనుచిత స్థలంలో ఉంచాను.

ఈ మధ్య షేక్ హాజరత్ అనే ఓ స్నేహితునికి నా వస్తు ప్రదర్శనశాల చూపడం తటస్థించింది. పిల్లనగ్రోవి కథనంతా అతనికి సమగ్రంగా వినిపించేను. అతడు దానినంతా చాలా కుతూహలంతోవిని, పిల్లనగ్రోవితీసి చేతులో పట్టుకున్నాడు. దాన్ని అటూ యిటూ త్రిప్పిచూసి, "దీనిమీద యేమని వ్రాయబడి ఉందన్నారు?" అని అడిగేడు. నాతో రహిమాన్ చెప్పిన మాటలే చెప్పి, అవి పిల్లనగ్రోవిమీద ఉన్నాయి, చదవమన్నాను. అదిచదివి అతను యిల్లు ప్రతిధ్వనించేలా చదవడం మొదలు పెట్టేడు! నవ్వడం పూర్తిగా ముగించిన తరువాత అన్నాడు, "క్షమించండి దీనిమీద ఉన్నమాటలు కొంచం హాస్యాస్పదంగా ఉండడంవల్ల నవ్వేను. నాకు తెలుసునను కొంటూన్న ఉర్దూ సరియైనదైతే, ఆమాటలు అర్థమిది:- 'అరేబియా దేశములో తయారు చెయ్యబడింది. దీనిలో యేదైనా లోటుపాట్లున్న యెడల వాపసు చేయవచ్చును.'"

ఇది వినేసరికి నాకూ పట్టలేనంత నవ్వు వచ్చింది. 'ఇంత మోసమా', అనుకున్న రహిమాన్‌కు అసలు వివాహమే కాలేదని హాజరత్ చెప్తూన్న మాటలు నన్ను మరీ కలవర పరచేయి!

"హాజరత్! అయితే యిదంతా వట్టి రహస్యమనుకుంటా, లేక వాళ్లు చేసే మోసమా?" అని ప్రశ్నించే, పొందిన దిగ్భ్రమను సవరించుకొంటూ.

"రహిమాన్, కుమ్మరివీధిలోనే కుండలమ్మే రకమని, మీకింతకుముందు తెలియదు కాబోలు!! అందుకనే మోసపోయేరు." అన్నాడు హాజరత్ నవ్వుతూ.

(ఆంగ్లము నుండి)


కిరికెటీయర్ వాత వ్యాధిచే బౌలు ఔటు ఆయెను

క్రమముగా క్రుషెన్ చే మళ్లీ ఫిట్ ఆయెను.

రామలాల్ యొక్క యిన్నింగ్సు వాత బాధచే పాడాయెను. తీక్షణమైన నొప్పులు అతని కీళ్లను కండరములను బంధించినవి. బ్యాటు పట్టుట కూడ అతనికి కఠిన హింసాయెను. అందుచే మ్యాచునుండి మరలి పోవలసెను, తన కిరికెట్ జీవనము అంతమొందెనని తలచెను. అది చూసి, అతని యజమానుడు "ప్రతి ఉదయము క్రుషెన్ వాడిచూడు" మని మంచి సలహా యిచ్చెను.

అటుచేసినమూడువారాలఅనంతరము,రాంలాల్ ఒక ముఖ్యమైన పెద్ద మ్యాచునందు ఘనముగా ఆరవై కొట్టెను. ఇప్పు డతడు ఎన్నడు లేని ఫారములో నుండుటకు క్రుషెన్‌యొక్క మేలు తలచును. ఏవిధమైన వాత వ్యాధియైనను, కీళ్లయందు కండరములందు మూత్రసంబంధమైన ద్రావకము నిలుచుటయే ముఖ్యహేతువు. ఈ ద్రావకములు మూత్రాశయము ద్వారనే బయట త్రోయగలము. మూత్రాశయము, పేగు వీటిని కడిగి, కూడ పెట్టబడిన అట్టి ద్రావకములను క్రుషెన్ బయటకు త్రోసి, వాటిని మళ్లీ ఏర్పడనట్లు జేయుటయే క్రుషెన్‌యొక్క రహస్యము. ఈ నాడే క్రుషెన్ తెచ్చుకొండి. మందుల వ్యాపారు లందరివద్దనూ పసుపు రంగు కార్టనులలో అమ్మబడు చున్నది.

వెల రూ. 1-10-0

KRUSCHEN SALTS

మీరు కూడ ఆ క్రుషన్ సేవనానుభవము పొందుడు



శ్రీమద్భగవద్గీత

(వ్యాఖ్యాత: శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు)

పంచమ ముద్రణము: వెల రూ. 4-0-0

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టి వీధి — జి. టి. మదరాసు.



చంటిబిడ్డయొక్క చేతులు మలినమగును...

మరియు మలినము ఎక్కడున్నదో అక్కడ క్రిములనుండి అపాయమున్నది!

తరచు లైఫ్‌బాయ్‌తో మీరు కడుగుకొనండి!

లైఫ్‌బాయ్ సబ్బు

మలినములోని క్రిములనుండి మిమ్ములను రక్షించును

L. 115-193 TL.



జక్స్ కట్టుక్

తామర గజ్జి యెగ్జిమా అనేకములైన చర్మవ్యాధులకు ఔషధము

గుడ్డకు అంటుకొనదు మరకపడదు

మద్రాసు ఏజంట్లు:- కార్ అండ్ కో, 2 తంబుచెట్టివీధి, మద్రాసు 1.

మద్రాసు స్టాకిస్టులు:- ఎం. వి. దవార్, 100, నైనియప్పనాయక్ వీధి, జి.టి. మద్రాసు.



బహిష్టు

ఏ కారణముచే నిలిచిపోయినా 'రుతు ప్రవర్తిని'తో చక్కబడును. ఇది గర్భమెంత కలిగినను మందు ఒక రోజులో బహిష్టు తిరిగి మొదలుపెట్టును. ఖరీదు రు. 5/- శక్తివంతమైనది. రు. 20/- నేరుగా వ్రాయండి. నిరపాయమైన సంతాన నిగ్రహమునకు "పర్వతి" శ్రేష్ఠమైనది. తాత్కాలికము రు. 3/ శాశ్వతము రు. 6/- వి. పి. 14 అణాలు.

ఒరు బీజము

పిచ్చికాయవాపు, బోదకాలు, ఒరుబీజము, హైడ్రోసిల్, కీళ్లవాపు "వి. హెచ్" ఆయింటుమెంటు ఒకవారంలో నిమ్మళించును. నాటి వాపుతగ్గును. ఖరీదు రు 5/- (రెండు) వి.పి. 14 అ

Kaviraj: R.N. CHAKRAVORTY
Calcutta 25. (A.P.)

స్టాకిస్టులు: అప్పు అండ్ కంపెనీ.
286. తేవరాజ ముదలివీధి రోడ్డు. మదరాసు

## న్యూయార్కు ఓడరేవు-టగ్‌బోట్ల కార్యక్రమం.

టగ్ బోట్లు ఓడను రేవులోకి నడిపిస్తున్న దృశ్యం.

ఓడలమధ్యనుంచి టగ్ బోటు జాగ్రత్తగా పరిక్రమించుతున్న దృశ్యం.

అగ్నిప్రమాదం సంభవించిన ఓడమీద టగ్ బోట్లు నీళ్లుచల్లుతున్న దృశ్యం.

## రసాయనిక ప్రయోగాలవల్ల వ్యవసాయయోగ్యంగా చేయబడిన చవిటి భూములు

తాటిచెట్లు మినహా గడ్డిపరకైనా మొలవని పట్టి చవిటిభూమి.

ఎకరానికి 10 టన్నుల చొప్పున జిప్సం సాల్టు ప్రయోగించినందువల్ల కలిగిన ఫలితం.

ఆ చవిటిప్రదేశంలో యేమీ యెరువులేకుండా నీళ్లు కట్టి నాట్లు వేస్తే కలిగిన ఫలితం. చిదపచిదపలుగా తప్ప మొక్క అంటదు. పెరగదు.

ఎకరానికి ఒకటన్ను చొప్పున గంధకం ప్రయోగించటంవల్ల కలిగిన ఫలితం. అయితే ఇది చాలాఖర్చు, అదికాక యీ ప్రయోగం చేసిన మరుసటి సంవత్సరం భూమిని బంజరుగా వదలవలసివుంటుంది.

## పూలతోటలో రాజకీయవేత్త

అమెరికా విదేశాంగ మంత్రి డీన్ అచిసన్ రాజకీయ కార్యకలాపాల వత్తిడి నుంచి, తన పూలతోటలో పనిపాటలు చేస్తూ కొంచెం విశ్రాంతి తీసుకుంటున్నారు.

జోసెఫ్ డి. చార్లెస్ అమెరికాలోని హైటీ రాయబారి.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.

మీ శరీరమునకు సాటిలేని చికిత్స
మైసూరు చందన సబ్బు
గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు.

Cuta Tone
FOR CUTS, PAINS, Etc.
DHOLE & CO. BARNAGORE-CALCUTTA

శుభ్రమైన చలువ...
ఏదంటే OK చలువే!

బానిస భారతదేశాన్ని బంధాలనుండి విడిపించి
స్వతంత్రపథం పట్టించిన
భవ్యజీవి
గాంధీమహాత్ముని అద్భుత జీవిత చరిత్ర
ఆత్మకథ
లేక లేక ఇన్నాళ్లకు చతుర్థ ముద్రణం వెలువడింది.
త్వరపడండి.
ప్రతి సంపుటము పోస్టేజితో సహా రూ. 5-9-0
ఒకేసారి 2 సంపుటములు పోస్టేజితో ,, 10-12-0
మొత్తం సొమ్ము ముందుగా మనియార్డరుద్వారా పంపవలెను. వి. పి. పంపబడవు.
ఆంధ్రగ్రంధమాల పో. బా. 212, మదరాసు.